Registered No. M-4484

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ అక్టోబరు నెల 23 వ తేది శుక్రవారం [నె 42 రు.

## బ్రిటిషు టాంకులు.



*

పూర్తిగ ఆయుధాలతో నిండి, ఉక్కు కవచముగల్గి, అతివడిగా పోగల బ్రిటిషువారి సరి క్రొత్త టాంకులు యిందుగలవు. ఇటు వంటివి యిపుడు లెక్కలేనన్ని ఇంగ్లాండులో తయారగుచున్నవి.

*

## యుద్ధ విమర్శ

రష్యాలో జర్మనుల క్రొత్తరక్షణ ఎత్తులు—హిట్లరు ప్రగల్భాలు—పడమటి రంగమున మిత్రమండలి దాడి యూరపులో బానిసదేశాల పీడన.

స్టాలినుగ్రాడు యుద్ధం.

స్టాలినుగ్రాడు యుద్ధం ఫలితంతేలకుండా అటూ యిటూగా వుందని అక్టోబరు 20 వ తేదీన మాస్కో విలేఖరి వ్రాస్తున్నాడు. ఆ నగర ఉత్తర భాగమునందు జర్మనులు స్థావరమేర్పరచుకొన్నచో మధ్య భాగమునందు చాలప్రమాదమేర్పడును. పరిస్థితులు విషమంగానే యున్నప్పటికీ, ఒక్క విషయం జ్ఞాపకముంచుకోవాలి. ఈ యుద్ధం ఫలితం ఎట్లున్నప్పటికీ, రష్యా సైన్యాన్ని నిరుపయోగం చేస్తామనే జర్మను ప్రయత్నం విఫలమయింది. ఈ విషయమును జర్మను సేనాధికారులును సైనిక విమర్శకులే స్పష్టంగా ఒప్పుకొనుట ఆశ్చర్యం వేస్తుంది. రష్యాపై తన మొదటి ఉద్దేశము యింకోపద్ధతిని సాధించుకోవచ్చునని జర్మనీ యిపుడనుకొనుచున్నది. లెనినుగ్రాడు మాస్కోరంగములందు యుద్ధమువలన కొంత అనుభవంగడించి, గత శీతకాలమునందు రష్యా తిరుగుదాడులను జర్మనులు కొంత నిరోధించగలిగిరి. ఆ అనుభవం బట్టి యిపుడు క్రొత్త రక్షణయుక్తిని అమలు జరుపుచున్నారు. కొన్ని ఆయుధరక్షిత కట్టడములు గల శిబిరాలను ఏర్పరచి, వాటి మధ్యమందు గనులుపెట్టి, టాంకు విధ్వంసక ఫిరంగిదళములు సంచారం చేయగలవి కాపాడుచుండినచో, రష్యను టాంకుదాడులను నిరోధింపవచ్చునని జర్మనులు తెలుసుకొనిరి. శీతకాలమునందు జర్మను సైన్యము ఓర్పు పూర్తిగ చెడిపోయి, చిత్తైయిపోనున్న సమయమున జేవ్, బ్రియంస్కు, వియస్మ, ఓరెల్, కార్కోవులందు యిటువంటి శిబిరాలు స్థాపించుకొనియే ఓడిపోకుండ

నిలచియుండ గలిగినవి. ఈ వేసంగియందు గూడ యిటువంటి రక్షకశిబిరాలే రష్యాదాడుల నుండి జర్మను సైనిక శ్రేణులను రక్షించినవి.

* * *

స్టాలినుగ్రాడులో జర్మనులు చేరినచో తిరిగి పోనేపోరని హిట్లరు గొప్పగ చెప్పియుండెను.

హిట్లరు ప్రగల్భం జర్మను యుక్తిలోపం.

అనగా జర్మనులు తమ రక్షణశ్రేణి వాల్గా నదివరకు వ్యాపింపజేసి, అక్కడనుండి రష్యను ఎర్రసైన్యమును ఎల్లకాలం నిరోధించుటకు వీలగునని ప్లాను వేసియుండిరని తెలియగలదు. చమురు, ఇనుము, బొగ్గు ఉత్పత్తి స్థానాలు క్రమేణ గోల్పోయినందున రష్యను సేన్యలకు దాడిచేసే శక్తి తగ్గిపోవునని జర్మనులను కొంటున్నారు. కాని వారొక విషయం మరచిపోతున్నారు. వంటచెరకు, ముడిపదార్థాలు తాత్కాలికముగ పోయినచో ఇంగ్లాండు, అమెరికాల నుండి మర్మాంస్కు రేవుగుండాను, పేర్షియా ద్వారాను సప్లయిలు రాగలవనియు, మధ్య రష్యాలోను యూరలు ప్రాంతములందు విశేషంగా సరకు నిలవా చేయబడినదనియు వారు మరచియుందురు. ఎప్పటికైనా వాల్గా నదివరకు తాము విరమింపవలసియుండునని ముందే ఊహించుకొనియున్నందున రష్యా సేనానాయకులు అదివరకే సరకు నిలవయుంచుకొనిరి. తమ రక్షణ శిబిరశ్రేణిని స్టాలినుగ్రాడువరకు పెంచుటవలన రష్యా సేనలను నిరోధించవచ్చుననే జర్మను లూహించుకొనిరి గాని, అంతదూరంపోతే అక్కడికి మార్గాలు రక్షించుకొనుట కష్టమనియు, బారనెజు దక్షిణంగా డానునదిమీదుగా అనేకవందల మైళ్ల వరకునున్న రష్యా స్థానములనుండి దాడివచ్చి తమ మార్గాలు చెడగొట్టబడుననియు లెక్కించకుండిరి. ఈ ప్రాంతమున రష్యనుల తిరుగుదాడులు హెచ్చుచున్నవేగాని తగ్గుటలేదు.

* * *

పడమటి యూరోపునందు శత్రువుల తీవ్రమగు దాడి ఏ క్షణమందైన ప్రారంభింపబడగలదని జర్మనులు ఎదురు చూస్తున్నారు.

పడమటి రంగం

ఇచటగూడ రష్యాలోవంటి రక్షణ శిబిరశ్రేణివల్లనే రక్షించుకో జూచుచున్నారు. ముడిపదార్థాలు లేకుండాచేసి రష్యసేనను నిరుపయోగం చేయాలని ఎట్లు ఆశించుచున్నారో, బ్రిటిషు అమెరికాల దాడులు జరుగకుండ చేయుటకు తమ జలాంతర్గాములపై నాధారపడియున్నారు. కాని, ఇపుడు క్రొత్త సాధనములవలన బలవత్తరమగు కాపలావలనను జర్మను జలాంతర్గాముల అవరోధము తొలగించబడినది. గడచిన వేసంగిలో మిత్రమండలి నౌకలకు ఎక్కువనష్టం కలిగించుటవల్లనే జర్మనీ ఓడిపోకుండ నిలువగల్గినదనుటకేమి సందేహం లేదు.

ఇపుడు జర్మనుల ఎత్తేమన తమకు బానిసైన యూరోపు దేశాలన్నింటిని తమ యుద్ధయంత్రానికి కట్టిపెట్టుట. యూరోపునకు పడమటనుండి తూర్పునుండి మధ్యధరా సముద్రం ద్వారా మార్గాలు లేకుండా చేసిరి. రష్యాలో పెద్దభాగం తీసుకొనుటవలన ఎంతకాలమయినా పోరు సాగించుటకు ఇనుము, బొగ్గు, నికెలు (ఇంకా చమురు చిక్కలేదు) తగినంత వారికి చిక్కింది. గోరింగు యిటీవల యీ దిగువ రీతి మాట్లాడినపుడు యీ విషయమే తెలిపెను: " రష్యావారి మంచి సారవంతమగు దేశం మనం (జర్మనీ) తీసుకున్నామని మరువకండి. బురద నేలలు మనకొద్దు. అవి వారికే ఉండని. చవిటి పర్రలాక్రమించి బురద బుక్కడములవలె కాదలచుకోలేదు. సరిగా ఆలోచించి ఏ ప్రాంతం ఉపయుక్తంగానుండునో అదే తీసుకొంటిమి.

* * *

జర్మనీకి యిపుడు ఎంతో కూలిజనం కావాలి. యూరోపంతా నాజీ కర్మాగారంగా మార్చివేసి బానిసలచేత పనిచేయించుటకు వారు నిశ్చయించుకొనిరి.

బానిస యూరోపునుండి జర్మనీకి కార్మికులు.

పోలండు, జకోస్లోవోకియా, ఫ్రాంసు యిటువంటి భయంలోనున్నవి. ఫ్రాంసునుండి 150,000 లు నేర్పరులగు పనివారిని పంపవలసినదిగా జర్మనీకోరెను. లావలు వారినిఎంచి పంపుటకు విశ్వ ప్రయత్నం చేయుచున్నాడు. చాల కఠిన చర్యలకు గడంగుచున్నాడు. నార్వే, బెల్జియములందు జరిగిన క్రూర కార్యాలు ఫ్రాంసులో గూడ జరుగవచ్చును. జర్మనీకి లొంగి బానిసలైన దేశాలందు భీతి కల్గించి నిర్బంధించి కార్మికులను జర్మనీకి అధికంగా తీసుకపోవుటకు జర్మనులు ఉద్దేశించిరి. ఒక విమర్శకుడు యిట్లనెను:

[తరువాయి 4 వ పేజీలో]

# చీనాలో బ్రిటిషువారి ప్రత్యేక హక్కులు వదలుకొనుట.

## చీనాతో స్నేహానికి నిదర్శనం.

1926 వ సంవత్సరము నాటి వాగ్దానం చెల్లించబడుట.

చీనాకు ఇంగ్లాండునుండి సౌహార్ద సంఘం బయలుదేరింది. అందు ఇరువురు కామన్సు సభా సభ్యులు, యిద్దరు ప్రభువుల సభా సభ్యులు గలరు. చీనా అధ్యక్షుడు చియాంగ్‌కాయి షేకు గారు యిటువంటి సంఘం యీ శీతకాలంలోగా చీనా ముఖ్యపట్నమగు చుంగ్‌కింగునకు రావాలని కోరినందున వీరు పోతున్నారు.

చీనాయడల సఖ్యత ప్రకటనలు

చీనాలో తమకున్న ప్రత్యేక ప్రాంతీయాధికారాలను ఇంగ్లాండు అమెరికాలు వదలుకొని, తమకు గల స్నేహభావము యీ రీతిగ వెల్లడించినందుకు, చీనా ప్రజలు మిగుల సంతసించి, యీ సభ్యులకు చాల ఆదరము చూపెదరు. ఈ అధికారాలు వదలుకోడం ప్రకటన అక్టోబరు 10 వ తేదిన వెలువడింది. ఆంగ్లేయులు యింత వరకు చీనాలో అనుభవించుచున్న ప్రత్యేక ప్రాంతీయాధికారాలు సౌకర్యములు వదలుకొనుటగూర్చి చీనా ప్రభుత్వంతో యుద్ధానంతరం బ్రిటిషు ప్రభుత్వం రాయాబారాలు జరుపుటకు సిద్ధముగా నుందియని 14-1-39 ; 18-7-40 ; 11-6-41 వ తేదీలందు ప్రకటించబడియుండెను. అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వంగూడ తమ దేశములకుగల యిటువంటి అధికారాలు హక్కులు వదలుకొని చీనా యడల సఖ్యత అన్యోన్యత ప్రకటించుచున్నామని అక్టోబరు 10 వ తేదినే తెలిపియుండెను.

ఈ ప్రకటనయందు మూడు అంతరార్థాలు గలవు. మొదటిది ఇట్టి ప్రత్యేక హక్కులు సౌకర్యములు వదలుకొనుటకు బ్రిటను ఎన్నో



ఏండ్లక్రిందట వాగ్దానం చేసియుండెను. రెండోది పశిఫికు మహాసముద్ర ప్రాంతములందలి భావి స్థితిని గూర్చి నిర్ణయించుటయందు ఇంగ్లాండు అమెరికాల సహకారము యీ విధంగా సూచింపబడెను. మూడోది జపాను ప్రకటించుచున్న "సమానాభి వృద్ధి ప్రాంతీయ విధము" నకు యిది సరియైన జవాబు. జపానుపై అమెరికా బ్రిటనులు దాడి చేయుటకు యిదోసూచన.

1926 వ సం॥ వాగ్దానం చెల్లించబడెను

చీనాలో బ్రిటిషు నివాసులు చీనా న్యాయశాస్త్రము కోర్టుల పరిపాలనకు లోబడి యుందురని 1926 లో బ్రిటను వాగ్దానం చేసియుండెను. ఆ వాగ్దానం ప్రకారం హాంకో, చింకియాంగొ, కియుకియాంగు నగరాలలో బ్రిటిషువారి ప్రాంతాలు చీనాకు ఒప్పగించబడెను. చీనాలో ప్రత్యేకాధికారాలు వదలుకొనుట అకస్మాతుగ జరిగిన నిర్ణయంకాదు ; చిరకాలంనుండి బ్రిటను అమెరికా ప్రభుత్వాలు సానుభూతితో యోచించుచున్న విషయము. ఈ సందర్భమున మొదటి చర్య చీనాను జాతి సమితిలో చేర్చుకొనుట, రెండో చర్య బాక్సరు ఇండెమ్నిటీలో తన భాగాన్ని ఆమెరికా చీనా కొసంగుట. దీనివలన చీనాయందు క్రొత్త విద్యా విధానం స్థాపించుటకు వీలయ్యెను. మూడో చర్య, పైన తెలిపినట్లు హాంకోమున్నగు పురములను చీనాకు పదహారేండ్లక్రిందట ఇంగ్లాండు యిచ్చివేయుట.

ప్రత్యేక ప్రాంతీయాధికారాల చరిత్ర చాల పెద్దది. చీనాలో విదేశీయులు అంతా ఒక

దగ్గర ప్రత్యేక సంఘంగా నివశించుచు, తమ ఆచారవ్యవహారములు, స్వంత శాసనములు పరిపాలన నియమములు అనుసరించు కోవచ్చుననే యేర్పాటు యిది. టర్కీ సామ్రాజ్యములో మహమ్మదీయేతరులందరికి వారున్న ప్రాంతాలలో యిటువంటి స్వపరిపాలనాధికారం, పరిపాలన సౌకర్యంకొరకు యిటువంటి " ప్రత్యేక ప్రాంతీయాధికారం " గలదు. పోరు పొచ్చులు లేకుండా ఉండేటందుకేర్పడిన యీ సౌకర్యం తరతమ భేదాలకు ఘనతన్యూనతలకు తావొసంగెను.

* * *

అనవసరంగా వచ్చిచేరిన విదేశీయుల చిక్కు తొలగించుటకు ఒసంగబడిన ప్రత్యేక ప్రాంతీయాధికారాలు, క్రమేణ విదేశీయుల ప్రత్యేక రాజ్యాలుగ ఏర్పడినవి. చీనా మధ్యను నిర్నిరోధమగు అధికారాలు గల సెట్లమెంటులు ఏర్పడినవి. ప్రత్యేక ప్రాంతీయాధికారం అప్పుడప్పుడు చీనా ప్రభుత్వ పరిపాలనాధికారాన్నే ధిక్కరించే స్థితికివచ్చినవి. దేశీయులకును విదేశీయులకు ఆచారవ్యవహారములందును న్యాయనియమములందును అనేక వ్యత్యాసములుండును కావున ఆదిని విదేశీయులకు ప్రత్యేక ప్రాంతీయాధికారములుండుట సబబుగ తోచును. కాని నేటి కాలమునందు భావైక్యత పెంపొందుటచే అన్ని దేశాల న్యాయవిధులు ఆచారములు ఒకేమాదిరిగా మారుచున్నవి. ఇపుడు ప్రత్యేక ప్రాంతీయాధికారాలు వదలుకొనుట ప్రజలందరికి ఒకే విధమగు ఆచారన్యాయ విచారణ నియమాలుండుట భావ్యమని అంగీకరించుటయే యగును. ఇంకో విశేషంగూడాగలదు. పెర్షియాలోగూడ యిటువంటి యేర్పాటుచేస్తే అట్లాంటికు ప్రణాళిక నియమాలు ఏషియాలో అమలు జరుపుచున్నట్లు ఎంచవచ్చును. దీనివలన కలిగిన సఖ్యత ఐకమత్యము బ్రిటిషు సౌహార్ధ సంఘం చీనాకు పోవుటవలన పెంపొందును.

ప్రత్యేక ప్రాంతాల అధికారాలు పాలకులకు నిరోధం.

[2 వ పేజి తరువాయి]

" ఇందువలన యూరోపు జాతుల ధైర్యం చెడుటయేగాక, వెనక తిరగబడిన వారిని నాశనం చేయుట, నిరుపయోగులను తిండి లేక మాడ్చుట, మిగిలియున్న పనికివచ్చు ప్రజలను జర్మనీకి తీసుకొనిపోవుట ప్రాప్తించును. హిట్లరు అతని సహాయకులు యీ దారుణ కృత్యాలు చేయుదురు "

ఈరీతిగా తామాక్రమించిన యూరోపంతటిలోని కార్మికులను, ముడిపదార్థాలను, ఆహారము, కర్మాగారాలను పూర్తిగా తాము బలవంతంగా దీసుకొనుటకే జర్మనులుద్దేశించిరి. జర్మనీయు, జర్మనీ ఆక్రమించిన యూరోపు స్వయం పోషకమగు కోటగా తయారయి, ఇంగ్లాండు అమెరికాలు ఎంత కాలంముట్టడి చేసినాను నిలిచియుండగలట్లు చేయదలచిరి. ఇంకో మాటలలో చెప్పాలంటే పురోగమన దాడులవలన, యుక్తి వలన యింతవరకు విజయాలు పొందుతున్న జర్మనులు వాటిని రక్షించుకోవలసిన స్థితికివచ్చిరి.

* * *

ఒక్కొక్క శత్రువుపై ఒక్కొక్కమారు శ్రద్ధ వహించి శత్రువులను ఒకరి తరువాత నొకరిని వేరువేరుగ ఓడించదలచి జర్మను ప్లాను విఫలమయిందని హిట్లరు యిటీవలి ఉపన్యాసంవలన రుజువయింది, ఇపుడు జర్మనీ యుద్ధ వ్యూహంలో ముఖ్యమగు స్థానములను రక్షించుకొనే స్థితికి వచ్చింది. అంటే కాలంతో పరుగెత్తే పందెంలో హిట్లరు ఓడిపోయి ఆకాలాన్నే తనకు మిత్రుడుగ తీసుకుంటున్నాడన్నమాట, సంయుక్తరాజ్యాలకుమాత్రం యుద్ధంలో గండం దాటిపోయింది. ఇది సంతృప్తి చెందదగ్గ విషయమే. ఇంతమాత్రాన విజయం మనచే జిక్కుతుందనుకోరాదు. ఇంకనూ బ్రిటిషు అమెరికను మిలిటరీ అధికారులు జర్మను సైనిక శక్తిని భేదించగలయుక్తులువన్ని మనకు విజయంచేరువ చేయవలసియున్నది.

సంయుక్త రాజ్యాల గండం దాటింది.

# తీన్ తేరా అక్షరాజ్యాలు.

యుద్ధంచేసిన కొలదీ హిట్లరుయొక్క బలం వృద్ధిఅవుతున్నదా? క్షీణిస్తున్నదా? ఈ విషయం చాలా ముఖ్యంగా గమనించవలసిన విషయం. ఎందుచేతనంటే, శత్రువును ఇకముందు జరుగబోయే యుద్ధంలో సులభంగా ఓడించుటకు అవకాశమున్నదా లేదా అనే విషయం దానివల్ల నిర్ధారణకాగలదు. అక్రమంగా కయ్యమునకు కాలుదువ్వినవాడు హిట్లరు. యుద్ధం ప్రారంభించినప్పుడు ఏ సంకల్పోద్దేశములతో తాను యుద్ధం సాగించవలసివచ్చినదని లోకానికి ప్రకటించినాడు? ఆ యుద్ధ సంకల్పములు నిజమైనవేనా? ఆ యుద్ధసంకల్పములు ఇంతవరకూ జరిగిన యుద్ధంవల్ల ఎంతవరకు నెరవేరినవి? లేక ఆ యుద్ధ సంకల్పములుకూడా అంతకంతకు వృద్ధియగుచున్నవా? హిట్లరుయొక్క ఆయుధబలం, అంగబలం ఎంతవరకు వృద్ధి అయింది? ఎంతవరకు క్షీణించింది? హిట్లరుయొక్క స్వపక్షబలం వృద్ధియైనదా! ఒకవేళ వృద్ధియైనట్లుగా ఏదైనను పైకి కన్పించుచున్నట్లయితే, అది నిజమైన ససారమైన కండపుష్టియేనా! లేక, ఏనుగకాలువలెగాని, గుల్మవ్యాధివలెగాని, కల్లవాపువలెగాని, పైకి హెచ్చుగా కన్పించుచున్న వ్యాధిగత దుర్బల లక్షణమా? ఈ విషయాలు బాగా శ్రద్ధగా పరిశీలించితే, హిట్లరు సాధించిన విజయం ఏమిటో బోధపడుతుంది. నిజంగా పెరుగుతున్నాడో, మహోదరం పెరిగి లోలోపల ధాతుపుష్టి నశించి క్షీణిస్తున్నాడో బాగా బోధపడుతుంది.

సంగ్రామం అనే బురదగుంటలోనికి హిట్లరు కాలుపెట్టి దిగి, అంతకంతకు దానిలోతు, దాని అంతు కనుక్కోవలెనని బాగా దిగుతున్నాడు. లోతుగా దిగినకొద్దీ చాలావరకు దాని అంతు తెలిసినదని సంతోషిస్తున్నాడు. ఇంకా కొంచెం దిగితే చాలునని దిగుతున్నాడు. కాని, ఆఖరుకు యీ బురదగుంటలోనుంచి, యీ ఊబిలోనుంచి లేచిరాగలడా? హిట్లరు లోకానికి ఘోటక బ్రహ్మచారివలె కన్పించినప్పటికీ మన సాధారణ సంసార కుటుంబముకంటె ఎక్కువగానే హిట్లరు సంసారం పెరుగుతోంది. లోకసహజమైన ఒక్క సూక్ష్మవిషయం ఆలోచించి చూడండి. సంసారములో వృద్ధి అంటే ఏమిటో బోధపడుతుంది. సంసారం అనేది వివాహంతో ప్రారంభమవుతుంది. పురుషుడు, అనగా బ్రహ్మచారిగా ఏకాకిగాఉన్న పురుషుడు, తనకు అన్నిపనులలోను తోడ్పడి తనకు సహధర్మచారిణిగా ఉండేటందుకు, తాను కష్టించి సంపాదించినది యావత్తు తనతోపాటు అనుభవించేటందుకు, ఒక స్త్రీని తనతో భాగస్వామిగా చేర్చుకుంటాడు. ఈ స్త్రీపురుష సాహచర్య సహవాస సంపర్క సమభోగంతో సంసారమనేది ప్రారంభమయింది కాని, యీ దాంపత్య ధర్మం సక్రమంగా, సలక్షణంగా, ఆశాభంగంలేకుండా సౌఖ్యంగా సాగినట్లయితే, సంసారచక్రాన్ని బాగా నడిపినట్లే ఎంచుకోవాలి. అయితే, అసలు తత్వంలోనే ఒక అవకతవకఉంది. పురుషుడు బలశాలి, స్త్రీ అబల. తనశక్తి సామర్థ్యాలన్నీ ఉపయోగించి అష్టకష్టాలుపడి పురుషుడు ఆర్జించితెచ్చిన అయిశ్వర్యంలో సగంభాగం అర్థాంగిగా ఉండుటకు అంగీకరించిన స్త్రీ కోరుతుంది. అర్థాంగి కోరికలు తీర్చడమే పురుషుని కొక పెద్ద తల బరువు కార్యభారంగా ఏర్పడుతుంది. అంతే కాదు. ఈ అబలను రక్షించడంకూడా అతని కొక పెద్ద కార్యభారంగా ఏర్పడుతుంది, పోనీ, ఇంత అవస్థపడినప్పటికీ, తనకార్యావసరాలకు అర్థాంగి తోడ్పడి అడుగు దాటకుండా అనుకూలంగా అక్కరకువస్తుందా? అక్కరకు రాకపోతే, ఆ దాంపత్యంకంటే మించిన దౌర్భాగ్యం ఇంకొకటిలేదు. అది మెడకు కట్టుకొన్న లేనిపోని మొండి బండరాయివలె ఉంటుందిగాని, తనకు అండగా ఉండదు. కాబట్టి, యీ దాంపత్యం సరిగా సాగకపోతే దానివల్లనే సంసారం సగం తీన్‌తేరా అవుతుంది. ఇక సంతానం వృద్ధి అయిన తర్వాతనున్నూ, సంసారం పెరిగిన తర్వాతనున్నూ ఉండే అవస్థలు చెప్పనక్కరలేదు. పుట్టినవాళ్లందరూ, చక్కగా అక్కరకు వచ్చే ప్రయోజకులు అవుతారా? అప్రయోజకులై దుర్మార్గులై, అమ్మను, నాన్నను, ఎముకలు కొరికి ఏడిపిస్తారా? వాళ్లలో వాళ్లు కొట్లాడు కొని, అమ్మతో నాన్నతో కలహించినట్లయితే,

ఆ సంసారం నిస్సారమై ముక్కచెక్కలై పోతుంది. ఆఖరుకు అమ్మకూ, నాన్నకూ తద్దినాలు కూడా పెట్టరు. వాళ్ల పేరే స్మరించరు. సంసారం వృద్ధియైనదనిన్నీ, ఇద్దరు దంపతుల మూలంగా ఇరవై మంది పిల్లలు పుట్టి కుటుంబ వృద్ధియైన దనిన్నీ సంతోషించినంతమాత్రంవల్ల ప్రయోజనంలేదు. ఒకటిగా ఉన్నది రెండు అయితే వృద్ధికాదు. రెండుగా ఉన్న సంసారం మెండుగా పెరిగినంతమాత్రంచేత అదివృద్ధి అనిపించుకొనదు. చేతిలోఉన్న పలకయున్నూ బలపమున్నూ క్రిందామీదా పడినప్పుడు పదహారు ముక్కలవుతాయి. అంతమాత్రంచేత ఆ పలకా, ఆ బలపము, మొదటికంటె చివరకు చాలా వృద్ధి అయినవని ఎవడైనా అనగలడా ?, తీన్‌తేరా అయి ధ్వంసమైనవని అంటాడు.

హిట్లరు యుద్ధానికి సన్నాహాలు చేసేముందు, తనకు తోడ్పాటుగా ఉండవలెననికోరి, మస్సులోనీని తన పక్షంలో చేర్చుకొన్నాడు. వాళ్లిద్దరూ ఒకరికొకరు, శరీరాలు భేదమేగాని, ఆత్మ ఒక్కటే, మనస్సు ఒక్కటే అన్నట్లుగా కలిసి మెలిసి వ్యవహరించారు. ఈ దాంపత్యంతో వారి సంసారం ప్రారంభమైంది. కాని, మస్సులోనీ స్వతంత్రశక్తిచేత యుద్ధంచెయ్యలేని అబలవలె తయారైనాడు, గ్రీసులో యుద్ధం చేస్తానని తనంతటతానే ఉపక్రమించి తన్నులు తిని వెనుకకు పారిపోయినాడు, ఈ అబలను రక్షించవలసిన బాధ్యత తననెత్తిమీద పెట్టుకొని, మస్సులోనీ మానసంరక్షణంకోసం హిట్లరు తన సేనలతోవచ్చి గ్రీసులో యుద్ధంచేసాడు. నిన్న వచ్చినవార్తలనుబట్టి ఇంకొక కొత్తవిషయం తెలిసింది. రష్యను యుద్ధరంగానికి పంపించుట కొరకు ఒక ఇటాలియను సేనను ఇటలీ ఉత్తర ప్రాంతంలో ఉన్న గొరోయిజీ వద్దనుంచి బయలు దేరవలసినదని మస్సులోనీ ఉత్తరువు జారీచేసాడు కాని, ఆ ఇటాలియను సైనికులు ఎదురు తిరిగి ధిక్కరించారు. "మేము రష్యాలో పోరాడుటకు పోము" అని తిరుగుబాటు చేసారు. ఈ తిరుగుబాటుకు మూలకారకులైన వారిని తుపాకులతో కాల్చి చంపివేసారు. ఆసైనికులవద్ద ఉన్న ఆయుధాలను తీసుకొని, నిరాయుధులను చేసి ఓడ ఎక్కించారు, హిట్లరు మస్సులోనీ దాంపత్యం ఎంత అనుకూలంగా సాగుతున్నదో అందువల్ల హిట్లరు బ్రహ్మచారి ఎంతసుఖపడుతున్నాడో, బోధపడుతోంది.

తన సంగ్రామ చక్రాన్ని నడిపించడానికి ఒక యిరుసు ఉండవలెనని నిర్ణయించి జర్మనీయున్నూ ఇటలీయున్నూ కలిసి ఒక యిరుసుగా ఏర్పడితే మంచిదని మస్సులోనీని హిట్లరు తనతో కలుపుకొన్నాడు. ఇరుసు మరింత గట్టిగా ఉండవలెననే ఆశతో, జపానునుకూడా తన అక్షరాజ్యాల కూటంలో చేర్చుకొన్నాడు, మొట్టమొదట మూడు అక్షరాజ్యాలతో హిట్లరుకూటం ఏర్పడింది. మూడుతో ప్రారంభించినపని ముక్కచెక్కలవుతుందని మనవాళ్లుఅంటారు, ఆఖరుకు అంతే అవుతుంది. ఇప్పుడు యీ అక్షరాజ్యాల సంసారం పెరిగి వృద్ధి అయింది. నాలుగైదురోజుల క్రింద ఒక వార్త వచ్చింది. 1943 వ సం॥ ఏప్రిలు 1 వ తేదీనుంచి, అయిరోపా ఖండంలో హిట్లరు పక్షంలోచేరిన అక్షరాజ్యాలన్నీ సమష్టిగా తంతి తపాలా టెలిఫోను సంబంధములు కలిగి వ్యవహరిస్తూ ఉండవలెనని ఒక ఖరారునామా హిట్లరు తయారు చేసాడట. ఈ అక్షరాజ్యాలు ఏవంటే, (1) జర్మనీ, (2) ఇటలీ, (3) ఇటలీలోవున్న సాన్‌మారినో అనబడే స్వతంత్ర ప్రజా స్వామ్య రాజ్యం, (4) యుగోస్లోవియాలోని క్రోషియా, (5) ఆల్బేనియా, (6) రుమేనియా, (7) బల్గేరియా, (8) ఆస్ట్రియా, (9) హంగరీ, (10) హాలండు, (11) డెన్మార్కు, (12) నార్వే, (13) ఫిన్లండు. ఇప్పుడు అక్షరాజ్యాలు తీన్ కాదు - తేరా అయినాయి, హిట్లరు సంసారం యీ ప్రకారంగా తీన్‌తేరా అయి చాలా వృద్ధిలోనికి వస్తోంది. అందుకు సందేహంలేదు, ఈ అక్షరాజ్యాల అతుకులబొంత హిట్లరు తనకొక పెద్ద శాలువవలె పైనకప్పుకొని గంగిరెద్దువలె పొంగి యుప్పొంగవలసినదేకాని, ఆఖరుకు యీ బసవడు అడ్డమైన గడ్డితిని, అవస్థలపాలుకాక మానడు. సంబాళించుకొనుటకు సాధ్యంకాని సంసారం దాపురించింది. అది తీన్ తేరా కాకమానదు.

# మద్రాసు పటాలములలో జనహాని.

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రింది రీతిగా జనహాని కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

| నెంబరు | హోదా. | పేరు. |
|---|---|---|

**చనిపోయినవారు.**

ఆర్ ఐ ఎస్.సి —

| | | |
|---|---|---|
| | సిపాయి.డబ్ల్యు./సి. | నారాయణ నాయుడు |

ఎల్ వై ఎ —

| | | |
|---|---|---|
| ఎం టి./985341 | సిపాయి డ్రైవరు. | వాసుదేవ పిళ్లె. |

మదరాసు సేపర్లు—

| | | |
|---|---|---|
| 62756 | సేపరు .. | నారాయణస్వామి |

**గాయపడినవారు**

ఐ ఎ ఒ.సి —

| | | |
|---|---|---|
| ఒ/71433 | సిపాయి/డ్రైవరు | బట్టం సెట్టి వెంకటరత్నం |
| ఒ/71468 | సిపాయి/డ్రైవరు. | మునుస్వామి. |

**తప్పిపోయి, యుద్ధ ఖైదీలుగ ఉన్నట్లు ఎంచబడినవారు.**

| | | |
|---|---|---|
| ఒ/72391 | సిపాయి/డ్రైవరు | కె అప్పలస్వామి. |
| ఒ/71446 | సిపాయి/డ్రైవరు | అచ్చన్న. |
| ఒ/105232 | లా/నా ... | పాప రాజు. |
| ఒ/32521 | ఫిట్టరు 3 సిపాయి | ఎల్. ఆర్. నాయుడు |
| ఒ/73897 | సిపాయి | పెరుమాళు. |
| ఒ/73252 | సిపాయి | వి. ప్రకాశం. |
| ఒ/73265 | సిపాయి . | శాంతప్ప. |
| ఒ/73248 | లా/నా | మునియనాధను. |
| ఎం.ఆర్ /895637 | లా/నా .. | సుబ్బయ్య పిళ్లె. |
| ఒ/32322 | ఫిట్టరు | జోన్సు విలియంస్వామి. |
| ఒ/73262 | సిపాయి/డ్రైవరు. | వేదనాయగం. |
| ఒ/73249 | సిపాయి/డ్రైవరు | యేసురత్నం. |

వీరుకాక :

| | |
|---|---|
| చనిపోయినవారు ... | 12 |
| గాయపడినవారు ... | 109 |
| చనిపోయినట్లు ఎంచబడినవారు .. | 1 |
| ఖైదీలుగనున్నట్లు ఎంచబడినవారు | 189 |
| యుద్ధ ఖైదీలు ... ... | 2 |

| నెంబరు. | హోదా | పేరు. |
|---|---|---|

**కనబడక ఖైదీలుగనున్నట్లు ఎంచబడినవారు.**

ఐ ఎ.—

| | | |
|---|---|---|
| ఎఫ్/536 | వైను 3 | చిన్నప్పన్. |

వీరుకాక :

| | |
|---|---|
| చనిపోయినవారు . .. | 13 |
| గాయపడినవారు | 107 |
| యుద్ధ ఖైదీలు .. | 14 |

**అదివరకు ఖైదీలుగ తెలుపబడి యిపుడు చనిపోయినట్లు తెలిసినవారు.**

మదరాసు సేపర్సు—

| | | |
|---|---|---|
| 16915 | నాయక్ . | ముత్తు. |
| 17028 | లా/నా .. | సీతారామ రెడ్డి |

**కనబడక చనిపోయినట్లెంచబడినవారు.**

ఐ.ఎస్.సి.—

| | | |
|---|---|---|
| 05349 | పెయిటరు | ధర్మలింగం |
| ఎ/4257 | సిగ్నలరు ... | ఎ. వేదకన్ను. |

**గాయాలతో చనిపోయినవారు.**

ఐ.ఎ.ఒ.సి —

| | | |
|---|---|---|
| ఒ/72493 | సిపాయి/డ్రైవరు. | వెల్లసామి |

వీరుకాక :

| | |
|---|---|
| చనిపోయినవారు .. .. | 76 |
| గాయపడినవారు . | 201 |
| కనబడక చనిపోయినట్లు ఎంచబడినవారు | 8 |

**గాయపడినవారు.**

ఐ.ఎస్.సి.—

| | | |
|---|---|---|
| ఎ/8119 | సిగ్నలరు .. | ఎల్. మారిముత్తు. |

వీరుకాక :

| | |
|---|---|
| చనిపోయినవారు ... .. | 33 |
| గాయపడినవారు .. | 15 |
| కనబడక చనిపోయినట్లు ... | 2 |
| కనబడక ఖైదీలుగనున్నట్లు ... | 27 |
| తిరిగిచేరినవారు ... . | 2 |

**వైస్రాయి కమిషను ఉద్యోగులు.**

**తప్పిపోయినవారు.**

ఆర్.ఐ ఎ.ఎస్.సి.—

| | | |
|---|---|---|
| సుబేదారు | రూసి ... | కె. సత్తార్. |

**ఇతర హోదాలవారు.**

**అదివరకు కనబడక ఖైదీలుగానున్నారనుకొని యిపుడు గాయపడ్డట్లు తెలిసినవారు.**

ఐ.యస్ సి —

| | | |
|---|---|---|
| 15059 | సిగ్నలు ... | జయరాం నాయుడు. |

| నెంబరు | హోదా. | పేరు |
|---|---|---|

**తప్పిపోయి, ఖైదులోనున్నట్లు ఎంచబడినవారు**

ఆర్.ఐ ఎ.ఎస్ సి.—

| | | |
|---|---|---|
| ఓ/78838 | సిపాయి | కె. దొరసామి |
| ఓ/78832 | సిపాయి | ఎల్ వెంకటేశ్వర్లు. |

ఐ.జి.ఎస్.సి.—

| | | |
|---|---|---|
| జి.ఎస్ ఎఫ్/8075 | వెయిటరు 3 | జుమ్మను |
| జి.ఎస్.ఎఫ్9803 | వంట | మోగను |
| జి ఎస్.ఎఫ్/2864 | ఊడ్చు | రామచందరు |

**చనిపోయినవారు.**

మదరాసు సేపర్లు—

| | | |
|---|---|---|
| 63504 | సేపరు | జోసఫ్ |
| 17423 | పి ఎ నా | పైడిరెడ్డి. |
| 67998 | సేపరు | సుబ్బరాయను. |

ఇండియను ఇంజనీర్సు—

| | | |
|---|---|---|
| 43971 | పి. | గోయింద రెడ్డి |
| 43860 | పి | నల్లప్ప. |

ఆర్.ఐ.ఎ ఎస్.సి. —

| | | |
|---|---|---|
| ఎంటి./986147 | సిపాయి | గోవింద రాజు. |
| ఎస్.ఆర్./ 173421 | సిపాయి | హరిహర్. |
| ఎంటి /957574 | సిపాయి | పలని అప్పన్. |
| 50775 | డ్రైవరు | రాల్లో. |
| ఎంటి./984995 | సిపాయి | వి. వి. శంకర నాయర్. |
| ఎంటి /984974 | లా/నా | వెంకన్న. |

ఐ. హెచ్.సి.—

| | | |
|---|---|---|
| 41059 | ఎల్/సిపాయి | జగన్నాథ్. |

ఐ.జి.ఎస్.సి.—

| | | |
|---|---|---|
| జి.ఎస్.ఎఫ్/27056 | వంట | ఎస్. అంతోని. |

ఎ.పి.సి.—

| | | |
|---|---|---|
| 117022 | కార్మిక | కందసామి |
| 43611 | వయసీరు | కన్నప్పను |

| నెంబరు. | హోదా | పేరు. |
|---|---|---|
| 261063 | కార్మిక | మధు |
| 255525 | కార్మిక | రాజారాం |
| 255450 | కార్మిక | విటోబ నారాయణ |

ఆల్వారు ఇంఫంటరీ—

| | | |
|---|---|---|
| 1707 | సిపాయి | కల్యాయ. |

**వీరుగాక :**

| | |
|---|---|
| చంపబడిరి | 1 |
| గాయపడిరి | 52 |
| యుద్ధ ఖైదీలు | 84 |
| చనిపోయిరి | 83 |
| తిరిగిచేరిరి | 4 |

**గాయపడినవారు**

ఐ ఎస్ సి —

| | | |
|---|---|---|
| ఎ/8832 | సిగ్నలు | మురుగేశను. |
| ఎ/8811 | సిగ్నలు | వి నారాయణను |

**చనిపోయిరి.**

6 వ కొచ్చిను కార్మిక కంపెనీ—

| | | |
|---|---|---|
| 43 | కార్మిక | అంతోని |
| 1 | కార్మిక | అయ్యప్పన్. |
| 6 | కార్మిక | జాన |
| 7/8 | కార్మిక | కుచు రామను. |
| | కార్మిక | పాపు |
| 35 | కార్మిక | పరము. |
| 10/14 | కార్మిక | వాసు. |

**వీరుకాక :**

| | |
|---|---|
| చంపబడినవారు | 2 |
| గాయపడిరి | 16 |
| తప్పిపోయి ఖైదీలుగనున్నట్లు లెక్క | 3 |
| యుద్ధ ఖైదీలు | 69 |
| చనిపోయిరి | 27 |

ప్రత్యేక సైనికానుబంధం.

Registered No. M-4484.

# యుద్ధ సంచిక.

వాల్యూం II. 1942 వ సం॥ అక్టోబరు 23 వ తేది శుక్రవారం. [నె 42 రు.

## దాడి!



ప్రత్యేక సైనికానుబంధం.

# యుద్ధ సంచిక

## ప్రపంచ యుద్ధంగూర్చి తెలుపు వారపత్రిక.

వాల్యం II.] 1942 వ సం॥ అక్టోబరు 23 వ తేది శుక్రవారం [నె 42 రు.

### విషయసూచిక.



### పటముల జాబితా.

# సైనికులను చేర్చుకొనే పద్ధతి.

సైన్యంలో రిక్రూటు చేయబడేవాడు అకస్మాత్తుగ గ్రామాలనుండి లాక్కొరాబడినవాడు కాడు. ఆలోచించి నచ్చి ఇష్టకంగావచ్చి చేరియుండును. కొన్ని నెలలనుండి అతడు సైనికులను చేర్చుకొనే ప్రచారం వినియుండును; లేదా గోడమీద ఆహ్వాన ప్రకటనలను చూచియుండును. అదివరకే సైన్యంలో చేరి సెలవమీద తన గ్రామానికి వచ్చి తన అనుభవాలను చెప్పుచున్న సైనికుడివద్ద కొంత తెలుసుకొని యుండును.

రిక్రూటు ఎక్స్ట్రా అసిస్టెంటు రిక్రూటింగు ఆఫీసరు వద్దకు పోవును.

క్రొత్తగ సైన్యంలో చేరదలచుకున్నవాడు జీతపు రిక్రూటరుని చేరినప్పటినుంచి అతడు భోజన సదుపాయాలు చేయును, యికమీదట దబ్బు గురించి తాపత్రయపడవ నవసరముండదు. జీతపు రిక్రూటరు క్రొత్తవానికి ప్రయాణపు ఖర్చులుకూడా పెట్టి అసిస్టెంటు రిక్రూటింగు ఆఫీసరువద్దకు తీసుక పోవును.



క్రొత్తగచేరిన సైనికులు తుపాకి డ్రిల్లు చేయుట.

అతను తానుకూడ సైన్యంలో చేరాలని నిశ్చయించుకొని తన వ్యవహారాలన్ని చక్కబెట్టుకొని గ్రామ మునసబువద్దకు పోయి లేదా రిక్రూటు చేయుటానికి వచ్చిన ప్రత్యేకోద్యోగివద్దకు పోవును. కొన్ని వందలమంది జీతాలపై యీ క్రొత్త సైనికులను తెచ్చుటకు నియమింపబడియున్నారు. వారు చెన్నరాష్ట్రంలో గ్రామాలన్నింటికి తిరుగుచుందురు. అనేక గ్రామాలవారికి వారు పరిచితులే. వారి ఖాకీదుస్తులు చేతిక ఆకుపచ్చని గుడ్డకట్టు సైనికులను చేర్చుకొనే ఉద్యోగియని చెప్పుతూనే వుంటాయి. ఈ వాలంటీరు ఆ జీతగాని చూడగానే అతడు జీతంగూర్చి యితర వివరాలగూర్చి తెలుపును. అతనితో కలిసి క్రొత్త

ప్రతి జిల్లాలో ఒక ఎక్స్ట్రా అసిస్టెంటు రిక్రూటింగు ఆఫీసరు ఉంటాడు. కొన్ని జిల్లాలలో యిద్దరు ముగ్గురుకూడా వుంటారు. క్రొత్తగ చేరదలచినవారెవ్వరుగూడ 70 మైళ్లకుమించి వీరిని చూచుటకు పోనవసరంలేదు. ఎక్స్ట్రా ఆఫీసరులు గూడ తరుచు సంచారంచేస్తూవుంటారు. కావున క్రొత్త రిక్రూటులు కోరినట్లైతే తమ గ్రామంలోనే అతన్ని చూడవచ్చును.

ఈ ఎక్స్ట్రా అసిస్టెంటు రిక్రూటింగు ఆఫీసరులు పింఛను తీసుకున్న సుబేదారులో, సుబేదారు మేజరులో లేక రిసాల్దారులో అయియుంటారు; గౌరవమగు పెద్ద ఉద్యోగులయి ఉం

టారు. అతడు క్రొత్తగ చేరదలచినవానిని ప్రశ్నించి, వాని అభిప్రాయము తెలుసుకొని, బరువు తూచి, వైద్యునిచే పరీక్ష చేయించును. తరువాత రిక్రూటు సేవకుడుగానో, గన్నరుగానో, కాల్బలం సైనికుడుగానో చేరికి పనికివస్తాడో ఆఫీసరుకు తెలియచేసి, ఆ శాఖనుగూర్చి చెప్పును.

కొత్తవాడు ఆఫీసరు కేంద్రస్థానమున ఒకటి రెండు రోజులుండును. కొంతమంది క్రొత్తవారు చేరినపిమ్మట అందరినీ చేర్చి బస్సులోనో రైలులోనో ఒక జీతపు రిక్రూటరుని సహాయమిచ్చి అసిస్టెంటు రిక్రూటింగ్ ఆఫీసరు కార్యాలయమునకు పంపుదురు.

అచటి కార్యాలయంవద్ద బారకాసు, స్నానాల స్థలము వంటగదులు మున్నగునవి వుంటాయి. 200 నుండి 500 వరకు పోషింపబడువారు వేచియుందురు. ఇచటనే మొదటిసారి యీ క్రొత్త రిక్రూటుకి సైన్యంలోయిచ్చే భోజ్యాల ప్రకారము తృప్తిగ భోజనం పెట్టుదురు. భోజన సమయానికి, కవాతునకు ఆఫీసరు పరీక్షాసమయానికి విధియుక్తాది సైనిక శిక్షణ ప్రాథమిక నియమాలు అలవాటు చేయబడును. వరుసగా నించోవడం, ముగ్గురితో కలసి సరిగా పాదంవేసి నడవడం నేర్పబడును. కాలయాపనకు ఆటలుకూడ నేర్పబడును.

అసిస్టెంటు రిక్రూటింగు ఆఫీసరులు భారతీయులుగాని యూరోపియనులుగాని, జిల్లా పరిస్థితులు బాగా తెలిసినవారు, జిల్లాలోని భాషలు తెలిసినవారయి యుందురు. కార్యాలయంవద్ద క్రొత్త సైనికుడు తిరిగి వైద్యపరీక్ష చేయబడి, బరువు వగైరా మున్నగునవి తనిఖీ చేయబడి సైన్యంలోని వివిధ శాఖలలో చేరికో నొకదానికి నిర్ణయింపబడును.

దేహదారుఢ్యం, విద్యనుబట్టి ప్రతివానికి స్థానం నిర్ణయింపబడును. పొడుగాటి పెద్దవారు గన్నరులుగను, యితరులు ఎం. టి. శాఖకు (ఆర్.ఐ.ఎ.ఎస్.సి.) లేక కాల్బలము, క్యూ.వి.ఓ. మదరాసు సేపర్సు అండు మైనర్సు దళములోను చేర్చుకొనబడుదురు. 2 వ ఫారముకాని, ఆ పైనిగాని చదివినవారు, ఇంగ్లీషు మాట్లాడగలిగినవారు నాను కమిషండు ఆఫీసరు కేడెటులు, సిగ్నలర్సు, స్టోకర్సు, నౌకాదళంలో నావికులుగను, యితర పనులకు చేర్చుకొనబడుదురు.

తరువాత జరిగేది సైన్యంలో చేర్చుకొనబడుట. ఇది ఈ పద్ధతిలో జరుగును. రిక్రూటులు వరుస వరుసగ నిలబెట్టబడుదురు. ప్రతివాడు 13 ప్రశ్నలకు బదులు చెప్పాలి. ఈ ప్రశ్నలు అర్థమయి బాగా జవాబులు చెప్పినచో ఆఫీసరకు సంతృప్తి కలిగిన పిమ్మట ఎన్రోలుమెంటు ఫారములో సంతకంచేయును, అంతట రిక్రూటు భారతీయ సైనికుడగును. అతడు 10 నుండి 100 మందితో కలసి ఒక రైలులో రిజర్వు పెట్టెలో పంపబడును. మొదట వీరిని చేర్చుకొన్న జీతపు రిక్రూటరు వారి వెంట మార్గదర్శిగాపోయి, వారి సైనికదళంలో చేర్చును. ఆ యూనిటులో వారికి సిపాయి శిక్షణ యొసంగబడును. సైన్యంలోనుండి సెలవుపై కొన్ని సిపాయి దుస్తులతో గర్వంగా యింటికి తిరిగి వచ్చినపుడే మరల అతని కుటుంబం రిక్రూటుని చూచును; జేబునిండా డబ్బుండును; వినదలచిన వారందరికి తన సైనిక అనుభవాలు తెలుపబడును. రిక్రూటింగు క్రమేణ అధికంగా జరుగుచునేయుండును. సెలవుపై ఇంటికివచ్చిన సైనికుడే భారతీయ సైన్యానికి మంచి ప్రచారం చేయగలడు.



" 38 అంగుళాల ఛాతీ! బలే. "

# నేటి సైనికులకు ఉండవలసిన అర్హతలు.

## ధైర్యమే విజయము.

### సైనిక శిక్షణము శాంతి సమయాలలోగూడ బాగా ఉపయోగపడును.

సామాన్యపు సోల్జరునుగూర్చి కొందరి మనసులలో ఎటువంటి అపోహలున్నాయి! మూడేండ్ల నుండి యుద్ధం జరుగుచున్నా, సామాన్యపు సిపాయి అంటే ప్రజలకు భయంగానే యుంది. సిపాయి అంటే చేతిలో తుపాకి ధరించి తిరిగే నౌకరనియే జనులు తలంచుచున్నట్లుంది. అటువంటి అపోహ వలన ఎటువంటి నష్టమున్నదో యీ యుద్ధంవలన స్పష్టంగా తెలిసింది. ఆ అభిప్రాయాలు శుద్ధ తప్పు అభిప్రాయాలు. నేటి సోల్జరులకు తెలివి తేటలు, విజ్ఞానం చాల వుండాలి.

కడుదూరము నడచి, విరోధాలు దాటినా కష్టం లేకుండా ఆనందంతో కండ్లు విప్పారుచుండగల ఆరోగ్యం దేహదారుఢ్యం సిపాయిలకుండాలి. అనేక రకాల ఆయుధాలు ఉపయోగించగల నిపుణత్వం సంపాదించాలి. ఎండలో గంటలకొలది, సిగరెట్లుగాని నీరుగాని లేకుండా గోతులు త్రవ్వ వళ్లు తీగలు పాతి, విషవాయువునుండి కూడా తాను రక్షించుకో గలియుండాలి. శత్రువును వెదకి కొట్టుటకు ఎప్పుడూ సిద్ధంగానుండాలి. అన్నింటికన్న ముఖ్యం అధికారుల ఉత్తరువులను



క్రొత్త సైనికులు కసరత్తు చేయుట.

వెంటనే మనస్ఫూర్తిగ నిస్సంకోచంగ అనుసరించుట అలవాటు చేసుకోవాలి.

క్రొత్తగా చేరిన సైనికుడికి ఇచ్చే శిక్షణము విద్యా ప్రబోధకముగను, దేహ సంపత్వాభివృద్ధి కరముగను నీతి దాయకముగను ఉండును. అంతా తెలిసి సమర్థతతో యుద్ధం చేయగల సిపాయి కావాలంటె, విద్యావంతుని కుండవలసిన ప్రధాన లక్షణాలన్ని ఉండాలి. జరిగిన విషయాలన్ని మనసులో జ్ఞాపకముంచుకొని, క్లుప్తంగా వాటి నొక చిన్న సందేశంవలె స్పష్టంగా వ్రాయాలి. బాగా విద్యనేర్చినవానికిగూడ యీ పని సులభ సాధ్యం కాదు. ఒక దేశ పటంపైనుంచి శత్రుసేనల తెలుసుకొని, తా నెరిగియున్నది గుర్తించి సరిగా చెప్ప వలసియుండును. ఈ పనులు చదువను వ్రాయను నేర్చి లెక్కలు భూగోళశాస్త్రం తెలిసినవారికి గాని సులభంకావు.

ఈ పనులుచేయుట అందరికి సులభంకాదు. కనుకనే ఉత్తమ గుణాలు సైనికులకుండుట అవసరం. ఈ గుణాలన్ని అలవరచుకొన్న పిదప, యీ సైనికుడు మామూలుగా గ్రామంలో ఉండి పోయిన వానికన్న ఎక్కువ ఆరోగ్యంగాను స్వాస్థ్యంగాను ఉండగలడు.

మొదట సైన్యంలో చేరగనే క్రొత్తవానికి యీ చేయవలసిన పనులన్ని వినేసరికి గాభరా చేస్తుంది. కాని, అతనికి శిక్షణ సమయంలో ఒసంగబడిన మంచి ఆహారము, జరిగే మర్యాదా చూచి, తనకు నేర్పేవారి తెలివితేటలు ఉత్సాహం గమనించిన పిమ్మట, ఆతడు మంచి ఉత్సాహం

తో యీ పనులన్నీ నేర్పుతుంటాడు. శిక్షణ పద్ధతి అంత బాగావుంటుంది.

## ధైర్య విశ్వాసములు.

యుద్ధ సమయంలో ధైర్య విశ్వాసములగూర్చి చాల సారులు వింటూవుంటాము. ధైర్యోత్సాహాలు ఎక్కువగల 'రెజిమెంటు' తన సంఖ్య కన్న ఎక్కువ సంఖ్యగల పిరికి రెజిమెంటులను ఎన్నింటినైన ఓడించగలదు.

క్లయివు ప్రభువు 3,000 మంది మదరాసీలతో బెంగాలులో ప్లాసీ యుద్ధమునందు 50,000 మంది గల శత్రుసేనను ఓడించెను. అతని ఉత్సాహము శక్తి అతని సేనలలో అంతటి ధైర్య విశ్వాసము లను పురికొల్పెను. వారెంతటి సేననైన ఎదిరిం

పౌరుషము మున్నగు సామాన్య విషయములపై నాధారపడియుండును.

క్రొత్తగ చేరిన సైనికులు తమ రెజిమెంటు యొక్క మనోభావాన్ని అతివడిగ అలవరచుకొంటారు. ప్రఖ్యాతిగడచిన బెటాలియనులు చెదరి చిందరవందరై యుండును. అందు క్రొత్తవారు చేరుచుందురు. అయినా యీ క్రొత్తవారు త్వరలో ప్రాతవారంత సమర్థులగు ధైర్యంగల సిపాయిలుగ మారెదరు. రెజిమెంటుయొక్క ఉత్సాహమే ముఖ్యమైనది.

రెజిమెంటులో జరిగే ఆటలపోటీలు, బ్యాండు, పాటలు, ఆచారాలు, ఉద్యోగులు, వారంటు ఆఫీసర్లు, నాను కమిషండు ఆఫీసర్లకు సిపాయిలకుండు



శత్రువుపై దాడి తరగతి.—నిజంగా దాడి చేస్తున్నట్లే నేర్పుతారు—కంటికగుపడే పొగ గుండ్లు పేలుట. వెనుక దూరాన సైనిక విద్యార్థులు ముళ్ళతీగలు దాటుచున్నారు.

చుటకు సిద్ధంగానుండిరి. గాలివాన ఉరుముల మధ్య తడుస్తు యుద్ధంచేసి వారు ఆశ్చర్యకరముగ విజయంబడసిరి.

ప్రత్యేక సైనిక వ్యూహంయొక్క సాంప్రదాయం కీర్తి ప్రాత చరిత్రముగూడ ధైర్య విశ్వాసములను తోడ్పడును. అందుకే క్రొత్తగచేరిన సైనికులకు వారే రెజిమెంటులో చేరెదరో ఆ రెజిమెంటు చరిత్ర చెప్పెదరు. ప్రతి సైనికోద్యోగికి తన సైనిక దళమే (బెటాలియను) ఎక్కువ ధైర్య విశ్వాసములుగల్గి, ఎక్కువ బాగా యుద్ధంచేయ్యాలను ఆసక్తి ఉండాలి.

విచిత్రమేమంటే "మొరాలు" అంటే ధైర్య విశ్వాసాలు సైనికుల సెలాముచేయుట, మున్నగ ప్రతిరోజు క్షవరం చేయించుకొనుట, పరిశుభ్రత, పరిచయ సంబంధాలవలన యీ ఉత్సాహం అధికమగుచుండును.

## యుద్ధానంతరం.

యుద్ధం ముగిసినాక తమ సైనికులు సివిలు జీవితంలో మంచి ఉపయుక్తమగు పనులు చేయగల్గి, సైన్యంలో చేరక ముందుండే కంటే మంచి జీవితం గడుపుటకు వీలగునట్లు చేయ ప్రతి సేనానాయకుడు ప్రయత్నించాలి. సివిలు జీవితంలో చేయవలసిన వృత్తులకు తగిన శిక్షణ యుద్ధ సమయంలో యివ్వబడదు, నిజమే. కాని వారికి మంచి మనోశిక్షణ యివ్వవచ్చును. అది వారి జీవిత పర్యంతము తోడ్పడగలదు.

ఉత్తరువుల ననుసరించుట ఎట్లో తెలుసుకున్నవాడు ఉత్తరువు లొసంగుట ఎట్లో తెలుసుకో

గలడు. అంటే అతని మనసు సరిగా ఆలోచించుటకు పరిస్థితులను సరిగా తెలిసికొనుటకు అలవాటు చెందిందన్నమాట. కావున, తరువాత అతడు ఎటువంటి పనిచేయవలసివచ్చినా దానికి అలవాటు పడగల్గును.

ఈ విషయములందే ఆధునిక సైన్యం పూర్వం సైన్యంవలెగాక భిన్నంగానుంది. ప్రాత సైన్యాల గురించి ప్రబలిన అపోహాలు మాత్రం యింకా పలువురికి వదలలేదు. నేటి సైన్యంలో స్థిరంగా రొడ్డగొట్టుగా చేయవలసిన పనులేమీ లేవు. ఉపజ్ఞ వుంటే, స్వంతంగా యోచించి పనిచేయగలిగితే చాల ప్రోత్సాహముండును. నిజంగా యుద్ధం చేయుచున్నపుడు ప్రతివాడు తన స్వంత బుద్ధి నుపయోగించి, ఏదో యుక్తివలన శత్రువుని మించుటకు కృషి చేయగల్గియుండాలి.

అజ్ఞానం సర్వదా విజ్ఞానంచే ఓడింపబడును. కష్టసహిష్ణుతగల మూర్ఖులు గొరిల్లా యుద్ధానికిగాని, శత్రుదేశంపై ఆకస్మిక దాడికిగాని పనికి రారని తెలిసిపోయింది. ఈ రకాల యుద్ధానికి మంచి తెలివితేటలు, సుశిక్షణము విద్య అవసరం. ఎంత బలమయిన శరీరానికైనా మెదడే నడిపించాలి.

నేటి యువసైనికుని ఆధునిక సైనిక శిక్షణంలో కలిగే అనుభవం ఎటువంటిది? అతని కది అమిత ఉల్లాసకరంగా ఉపయుక్తంగా నుండును. బాల భటులకుండే నూతనోత్సాహం, కాలేజి విద్యార్థులకుండే కలసికట్టుతనం, మంచి సహచర్యంవలన వచ్చే స్నేహభావం, నాయకులయందు తన ధర్మమునందు విశ్వాసము అలవడును. అందుచే నిజంగా అతడు ఆరోగ్యవంతుడు సౌఖ్యవంతుడగును. ఎన్నడో తప్పక మనకందరికి చేకూరే శాంతి సమయాలందు అతడు గొప్ప మర్యాదస్తుడు పెద్ద మనిషి కాగలడు.



దాడి తరగతి. దాడి చేస్తున్నవారిని పొగవాయువుతో చెదరగొట్టుట.



నీటిపైనున్న దూలాలపై దాటుట.



నిరోధాల పందెము నీటి అడ్డంకి దాటుట

# సైన్యంలో నా మూడు నెలల అనుభవం.

(ఒక హావల్దారు వ్రాసిన వ్యాసము.)

గత మూడు నెలలో సైన్యంలో నా అనుభవం గూర్చి వినడానికి మీకు సరదాగా నుంటుం దనుకుంటాను.

యూనిటులో చేరడానికి పోతూవుంటే, సైన్యంలోని ఒక సివిలు గుమాస్తా నన్ను బెదిరించెను. యుద్ధంచేసే సైనికుడుగ చేరినందున, చాల కఠిన నియమాలకు లోబడియుండాలనియు, పొరబా టేదయినా చేస్తే కోర్టు మార్షలు చేస్తారనియు చెప్పేడు. ఇంగ్లాండులో కోర్టు మార్షలు (సైనిక శిక్షలు) గూర్చి కొంత చదివియున్నందున నాకు నిజంగా భయం వేసింది. పూర్వం కంభంకికట్టి కొరడాలతో కొట్టేవారు. సైన్యంలో చేరిన తరువాత అట్లా జరుగలేదని, అటువంటి భయం లేదని నాకు తెలిసింది.

సైన్యంలో చేరడం అంటే మృత్యుముఖానికి పోవడమనీ, నిర్దాక్షిణ్యంగా తుపాకులు కాల్చడానికి తయారవుతారు కనుక క్రూరులై మోట మనుష్యులై పోతారనియు సామాన్యంగా ప్రజలంతా అనుకుంటారు. కాని బుద్ధిమంతుడు, ఇంకిత జ్ఞానంకలవాడు సైన్యంలో నేర్చుకోవలసి నవి చాలా వున్నాయని తెలుసుకుంటాడు—క్రమ శిక్షణ, కలిసికోరుతనం, విధి నిర్వహించాలనే బాధ్యత గుర్తించుట. ప్రతి పనికి ఒకసమయం, స్థలం, పద్ధతి నిర్ణయించియుంటాయి. విధిని ఎవ్వడు తప్పించలేడని నానమ్మకం, అది అటుంచి, సైన్యం గురించి పైవిధంగా సామాన్య ప్రజలు అలా అనుకోడం తప్పని, మనలో చాల మందికి వీర స్వభావం లేకపోబట్టే అలా అనుకుంటున్నామని నే చెప్పగలను. సైన్యంలో నేడు పెక్కండ్రు దాక్షిణాత్యులు పెద్ద ఆఫీసరు ఉద్యోగాలలో ఉన్నవారు యిప్పటి సైనికులవలె మొదట రూ 16 లు జీతం కాక, రూ 7 లేక 9 లు జీతంతో సిపాయిగా ప్రారంభించినవారే అని తెలిసినచో, యీ దురభిప్రాయాలు పోతాయి.

నే చెప్పిన యీ ఆఫీసరులలో పెక్కుమంది వారి విద్యాధిక్యతవల్లకాక, సర్వీసునుబట్టి సైనిక విధులు నిర్వహించు సమర్థతనుబట్టి యీ పెద్ద ఉద్యోగాలకు వచ్చిరి. అందుకే వారు సామాన్య ప్రజలతో కలిసినా గూడ సైనిక జీవితంయొక్క మంచిచెడ్డలు ప్రజలకు నచ్చేటట్లు చెప్పేవారు కారు. కనుకనే సైన్యంయొక్క మంచినిగూర్చి ప్రజలకు తెలియడంలేదు. ఇపుడు చాలమంది విద్యావంతులు, యువకులు అన్ని తరగతులవారు సైన్యంలో చేరేరు. వారి జీతాలుగూడా చాల వరకు పెరిగేయి.

నేనొక పెద్ద నగరానికి 5 మైళ్ల దూరంలో గ్రామ సీమయందు మంచి శీతోష్ణస్థితిగల ప్రదేశంలో నున్నాను. మా మకాంకి చుట్టు విశాలమయిన బయలు ప్రదేశాలుండి, పొగతోకూడిన పట్టణాలు లేనందున, అందమయిన ప్రకృతిని అనుభవించుట నాకు సరదా గనుక, యీ జీవితం నాకు చాల బాగుంది.



సిపాయిగానుంటే ఏమి తప్పు ?

నేను, నా సహోద్యోగులము కలం తుపాకి రెండూ ఉపయోగించగలం కనుక, మమ్మల్ని సోల్జరు క్లర్కులంటారు. ఇన్నేండ్లు అర్థతులం బరువుగల కలం వాడే చేతులు యిపుడు పది పౌనుల తుపాకీ వాడుట కొంత కష్టమే. కాని కొద్దికాలంలోనే యిదికూడా అలవాటవుతుంది.

సోల్జరులమగుటచే ప్రతిరోజూ దేహదారుఢ్యం కోసం చేసే డ్రిల్లు మంచి ఆరోగ్యం యిస్తున్నది,

దుస్తులు, ఆహారం.

ప్రతిరోజు వాడుకొనుటకు మాకు తగినన్ని దుస్తులు యిస్తారు; చలికాలం చలివేయకుం డాను, వానకు తడవకుండాను పెద్ద కోటు ఇస్తారు. అదికాక మఫ్తీదుస్తులు (హిందూస్తానీ దుస్తు లంటారు) అవికూడా యిస్తారు. అది మీకు వింతగ నుండును. దుస్తుల విషయంలో మా బెటాలియనుయొక్క కర్నలునుండి దిగువ సిపా యివరకు అందరు యించుమించు ఒక్కలాంటి దుస్తులే కవాతు చేయునపుడు వేసుకుంటారు. సైనిక నిబంధనల ప్రకారం కమిషండు ఆఫీసరు లందరికి, దిగువ ఉద్యోగులును, సిపాయిలును సలాం చేయాలి. వెంటనే అతడు అదేవిధంగా సలాం చేస్తాడుగాని, సివిలు ప్రజలలో కొందరు పెద్దలు తలఊచడమో, నవ్వడమో ఒకటి రెండు వేళ్ల మాత్రం కదిలించడమో చేయరు,

ఆహారం విషయంలో సైనికులందరికి ఒకే విధంగా యిస్తారు—తమ సైనికులకు తగిన ఆహారం సకాలంలో యిస్తున్నట్లు ఫిర్యాదులు లేకుండా వుండేటట్లు ఆఫీసర్లు చాల శ్రద్ధ వహిం చుతారు.

వైద్య చికిత్స చాల బాగుంది. జబ్బుని ఆదరించి పెంచరాదు. నిరోధించాలనే భావం ప్రబలియున్నా, నిజంగా జబ్బు ఉండే ప్రతివాడు చికిత్సకై వెంటనే హాజరు కావాలి. వైద్యులు శిఫార్సుచేస్తే చికిత్సకై సెలవు నిండు జీతంతో యిచ్చి, యింటికి పోయే ఖర్చులుకూడా యిస్తారు. అంతేకాక, అప్పుడప్పుడు నిర్ణీత గడువులందు ప్రతివారికి ప్రభుత్వంవారు సెలవులిచ్చి, నిండు ఖర్చులిస్తారు. కాజువలు లీవు తీసుకున్నపుడు సగం ఖర్చు సౌకర్యం యిస్తారు.

ఆటలలో ఆఫీసరులుగూడ సైనికులతో కలసి ఆడతారు. అందువల్ల చాల ఉత్సాహంగా నుండును. రేడియోలు, మాజికు మున్నగు ప్రదర్శనాలుకూడా వినోదంకొరకు ఏర్పాటుచేస్తూ వుంటారు.

అంతకంతకు క్రొత్త సైనికులు ఎక్కువగ వస్తున్నారు. నేనే అసలు పొట్టివాడిని. అందులో కొందరు నాకన్న పొట్టి. క్రొత్తవారిలో పెక్కు మంది ఒక్క పంచతోను లేదా యింకో చింకి చొక్కాతోనో వస్తారు. వారికి రాగానే, మంచి పక్కచుట్ట, 2 జతల యూనిఫారము దుస్తులు, 3 రకాల జోళ్ల, పెద్ద ఓవరుకోటు యిచ్చే సరికి వాటిని ఎట్లా వాడుకోడమా అని ఆలోచిస్తూ వుంటారు. కొందరు దుస్తులకు మురిసిపోయి, యూనిఫారములు విడువకుండా తొడుగుచూ దాని తోనే పండుకుంటారు. మరికొందరు పేరేడులో తప్ప తక్కిన అన్ని సమయాలందు పెద్ద కోటు వేసుకొంటూవుంటారు. కొందరు ఒకదాని తరువాత నొక సిగిరెట్టు సర్వదా త్రాగుచూవుండం అలవాటు చేసుకుంటారు. ఇండ్లకు దూరంగా నున్నాముకదా యని యిష్టంవచ్చినట్లు చేస్తూ వుంటారు. అట్టివారిని సమర్థులగు సిపాయిలుగ చేయుటకు ఆఫీసరులు చాల కష్టపడుదురు. కొందరు క్రొత్త రిక్రూటులు చేరేటప్పుడు తిండి భోజనం పెడతారు, పని అట్టేవుండదని ఎవరో చెప్పినందున నమ్మికొని, కొన్ని నిర్బంధాలున్నా యని తెలియగనే పారిపోతారు. తమంత తాము వచ్చి సైన్యంలో చేరేక పారిపోతే శిక్షపడుతుందని తెలియక అట్లా చేస్తారు. కాని అట్లా పారి పోయినవారి సంఖ్య చాల తక్కువ.

సైన్యంలో మన మతానికి ముప్పులేదు; మిలి టరీ పనులకు అడ్డురానంతసేపు మీ మతం మీరు అనుసరించుటకు ప్రోత్సాహంకూడ ఉంటుంది. విద్య నేర్చుకోడానికిగూడ అవకాశాలున్నాయి, అందరికి ఉర్దు, ఇంగ్లీషులో ప్రాథమిక పాఠాలు చెపుతారు. అర్హులకు అతిత్వరగా ప్రమోషనులు యిస్తారు.

మా బెటాలియనులో చాల ఉత్సాహవంతు లును ఔదార్యం కలవారు ఆఫీసరులున్నారు. క్రమవిరుద్ధంగా ప్రవర్తిస్తే మాత్రం సహించరు. చురుకుగా పనిచేయడం సరదాగల యువకులంతా సైన్యంలో చేరితే, ముందు జీవితంలో ఉపయోగ పడే మంచి అలవాటులు చేకూరుతాయి.

# ఆఫీసరుల ట్రెయినింగు స్కూలు, బెంగుళూరు.

బెంగుళూరులోనున్న సైనికోద్యోగుల శిక్షణ పాఠశాల యిటీవలనే రెండవ వార్షికోత్సవం జరుపుకొంది. ఈ రెండేండ్లలో అందు శిక్షపొందిన కేడెటుల సంఖ్య నాలుగువందలనుండి 14 వందల వరకు పెరిగింది. క్రొత్తవారు శిక్షణ పొందుటకై వస్తున్నంతకాలం యీ సంఖ్య తగ్గదు.

వీరి శిక్షణ క్రమేణ కఠినతరమును, ఎక్కువ గంటలు పనిచేయుటయు, నియమాలు అధికముగుటయు జరుగుచున్నది. సైనిక వున్నతోద్యోగుల హాయిగా ఎమర్జె సీ కమిషండు ఆఫీసరులై అనేక సదుపాయములు పొందుటకు ముందు యీ పాఠశాలయందు కాడెటు (విద్యార్థులు)గ అవస్థలుపడుట తప్పని శిక్షయని అందరు భావింతురు. ఈ పాఠశాలయందు గడిపిన దినాలే సౌఖ్యప్రదములని ఇ.సి ఒ. ఉద్యోగాలు లభించిన పిదప అనుకోడం కష్టం. అదివరకు కట్టుబాటులు కఠిన నియమాలు శిక్షణ ప్రకారం జీవించుట సైనిక పద్ధతు లెరుంగనివారికి యిది మరీకష్టంగా నుంటుంది. కాని యీ కష్టాలు అట్టే కష్టాలుగా భావించ వీలులేని క్రొత్తపద్ధతియొకటి కనిపెట్టబడెను ఇపుడు భారతీయ కాడెటులందరు ముందుగా ప్రీ కాడెటు స్కూలు అను ఒక పాఠశాలలో చేరవలసినట్లు పర్పాటుచేయబడెను. అందువలన అదివరకు సైనికసేవంటే ఏమిటో ఎన్ని కష్టాలుండునో తెలియనివారు, యీ ప్రీ కేడేటు శిక్షణలోనే దీనిగూర్చి కొంత తెలుసుకొని, ఆ కఠిన పద్ధతులకు తాము అలవాటు పడగలరో లేవో తెలుసుకోవచ్చును.



సైనిక ప్రదర్శనమునందు కాల్బలం సైనికుడు పురోగమన దాడికి పోవుట.

బెంగుళూరులోనున్న ఆఫీసరుల పాఠశాలయందు, అట్టి యితర పాఠశాలలందును ఆ కొద్ది కాలంలో చెప్పగల్గినంత చెప్పి సైనిక తత్వం విద్యార్థులకు ఎక్కించబడును. కాల్బలంలో చేరక, గన్నర్లు, సిగ్నల్సు రాయలు ఇండియను ఆర్మి సర్వీసుకోరు (ఆర్.ఐ.ఎ.ఎస్.సి.) లందు యింక ముందు ప్రత్యేక సాంకేతిక శిక్షణ పొందు వారికిని యీ పాఠశాలలందు సామాన్య సైనిక నియమాలు నేర్పబడును. కాల్బలంలో చేరిన వారిని (ఇంఫాంట్రీ) ప్లాటూను లీడరు సమర్థత బడయునట్లు రక్షణ యొసంగెదరు అటుతరువాత తమయూనిటులో అనుభవంపొందినపిదప వారు ఒక కంపెనీ సైనిక దళమునకు నాయకత్వంవహించి నడిపించగల్గియుండాలి కాడెటులు తమతమ యూనిటులలో చేరగానే కంపెనీ నాయకుని తరువాత రెండవ నాయకునిగ నుంచబడుదురు. కనుక ఏ క్షణంలోనైన వారు కంపెనీ కమాండరు స్థానే కంపెనీ నాయకత్వం వహించి పనిచేయవలసియుండును.

శిక్షణపొందు కాడెటులలో పెక్కండ్రు దేశ పరములు చూసి తెలిసికొనుట, సైనిక ఎత్తులు, నాయకత్వం వహించడం బాగా నేర్చియుండాలి. ఇందు సమర్థత లేకుండా ఫేలయినచో, తగిన అర్హతలేని వాడుగనే యెంచబడును. కొందరు కాలేజీ చదువులలో ఎంతటి తెలివి తేటలు చూపినా సైనికుల నాయకత్వం వహించి కర్రపెత్తనం చేసే సమర్థత లేక వెనుకబడుదురు. ఈ సమర్థతలేనివారికి, యుద్ధరంగంలో పనిచేయు

పలువురి జీవితాలు ఒప్పగించుట అసాధ్యమగును. సేనానాయకత్వం వహించగల సమర్థత చూపుటకు ఎన్నియో అవకాశములు కాడెటులకు ఒసంగబడును. సెక్షను దళమునుండి కంపెనీ దళమువరకు వివిధ తరగతుల సైనిక దళాలకు, బారకాసులలోను, యుద్ధరంగాలలోనుగూడ నాయకత్వం వహించుటకు అనేక రకములగు అవకాశము లివ్వబడును. అత్యంత ఉత్తమమైన సమర్థత ఉండాలని కోరుటలేదు. ఉపజ్ఞ ఏ మాత్రములేక, అధికారం చెలాయించే శక్తి ఏ మాత్రము చూపనివారే, యీ పరీక్షయందు విఫలులైనట్లు యెంచబడుదురు. కొంత చురుకు, మోటతనంకూడ అవసరం. అడ్డంకులుదాటి పరిగెట్టడం, దాడిచేయు తరగతులయందు యీ మోటుతనం వచ్చేస్తుంది. దేహదారుఢ్యము, చొరవలేనిది యుద్ధరంగంలో కష్టాలుపడుట కష్టం. కావున, అదికూడ యీ శిక్షణయందు చేకూరును. పట్టుదలకావాలి. మనిషి యెంత అలసిపోయినా పట్టుదలయుంటే చాలా ముందుకి పోగలడు. అదికూడ యీ శిక్షణయందలవడును. సైనికుడు ధరించే దుస్తులు ఆయుధాలు మున్నగువాటన్నింటితో కొంతదూరం నడచిన పిమ్మట, అడ్డంకులను దాటి పరిగెత్తే తరగతి పూర్తిచేసి అదే దుస్తులతో నీటిలో యీత పరీక్షయందుకూడ ఉత్తీర్ణుడయినచో ఆ విద్యార్థికి ఆఫీసరుకుండవలసిన ఓర్పు కష్టసహనశక్తి వచ్చినట్లే యెంచబడును.

దేహదారుఢ్యము కష్టసహిష్ణత ఉండాలని విధించడంతోబాటు, సిపాయిల మనోవికాసానికి తగు ప్రయత్నములు చేయకపోలేదు. మామూలుగా యిచ్చు ఉపన్యాసాలు, టాక్టికలు ఎక్సర్సైజులతోబాటు, యుద్ధరీతి వారికి స్పష్టంగా కండ్లకు కనబడేటట్లు "ట్రెయినింగు ఫిల్ములు" చూపబడును. సైనిక వ్యవహారము, రాజకీయ పరిస్థితులు, యుద్ధగతికి సంబంధించిన విషయాలగూర్చి ప్రశ్నలడుగుటకు, చర్చలు చేయుటకు కొన్ని గంటలు ప్రత్యేకించబడును. అన్ని శిక్షణ పాఠశాలలందును మంచిగ్రంథాలయములున్నవి. సైనిక శాస్త్రమునందు రాజనీతినిగూర్చి పెద్దపెద్దవారు వ్రాసిన యిటీవల ప్రచురించిన గ్రంథాలన్నిగూడ యుంటాయి. అంతేకాక ప్రపంచంతో జోక్యం తగ్గిపోయి, ఎంతసేపు కాకీదుస్తుల్లో డేరాలలోనే పడియుండు సైనికులకు విసుగు పుట్టకుండ కాలక్షేపానికి పనికివచ్చి నవలలుగూడా యుండును.

సమర్థుడగు కమిషండు ఆఫీసరుగా తయారుచేయాలంటే 6 నెలల శిక్షణ చాలదు. కావున ఆ ఆరు నెలలోనే బహుకష్టపడి పనిచేయాలి. అన్ని విధాల యీ శిక్షణ చాలయెక్కువ ఒత్తిడితో కూడియుండును. అది దాటి రాగలచిన వారే సమర్థులవుతారు. అట్టి సమర్థులే యుద్ధంలో మన సైనికులను విజయద్వారానికి నడిపించగలరు.



కాల్బల సైనికదళం దాడి వెడలుట

# యుద్ధ దృశ్యం.

## దక్షిణ ఇండియా సైన్యం చర్యలు.

### ఒక ప్రేక్షకుని అభిప్రాయము.

[ఇండియాలో దక్షిణ భాగమునందున్న సైన్యానికి సదరను ఆర్మీ అంటారు. దీని ముఖ్యస్థానం పూనా బెంగుళూరులో ఒక కేంద్రస్థానం గలదు. ఈ సైన్యం సెప్టెంబరు రెండో వారంలో రాణీపేట చెంతను లాలూచీ యుద్ధం జరిపి తన శక్తిని ప్రదర్శించెను. మదరాసు గవర్నరు సర్ ఆర్థరు హోపుగారు వారి సహోదారుం కూడ వచ్చి చూచిరి. ఆ సైన్యప్రదర్శనం చూచిన ఒకరు వ్రాసిన వ్యాసం యీదిగువ గలదు]

ఆదివారం ఉదయం పెందలకడనే వంటశాల నౌఖరులు వచ్చి మమ్మల్ని లేపిరి. ఫలహారానంతరం ఆరాటుసకుగల రోడ్డుపై పోతిమి. కలవాయివద్ద మూడు రాత్రులనుండి నిద్రలేని ఒక సైనికోద్యోగి త్వరగా పోతే టాంకులు యుద్ధంచేయుట చూడ వచ్చునని మాకు చెప్పెను. వానికి థ్యాంక్సు చెప్పి, మా మోటారు బండ్లు, గుంటలుబడిన ఆ పాడు రోడ్లపై దుమ్ము రేగగొట్టుకుంటూ పడుతూ లేస్తూ త్వరగా పోయినవి. ఆ దుమ్ము లండనులో పొగ మంచువలె నుందని మా డ్రైవరనెను. రెండు వైపుల టాంకు దళాలు యుద్ధం ప్రారంభింపనున్న సమయానికి మేము ఆ మైదానం చెంతకు చేరితిమి.



టాంకు త్రోసుకొనిపోవుట.



టాంకు గట్టు దాటుట.

శత్రుసేనలు సిద్ధంగా నున్నవి. ఇనుపాయుకవచాలు ధరించి, కప్పులక్రింద దాగొని మైదానంలో ఒకవైపు కావలా కాయుచున్నవి. ఎదురుగా టాంకులు వస్తున్నాయి. శత్రుసేనకు వెనుక నొక ఎత్తైన స్థలంపై మేము నిలచితిమి. గవర్నరుగారు, అడ్వైజరులు, సైనికోద్యోగులు ఆహ్వానింపబడిన యితరులతోబాటు ప్రమాదం లేని, ఖర్చు లేని బాగా కనబడే చోటు మాకు దొరికింది.

త్వరలో దూరాన చెట్లలోనుండి టాంకులు దొర్లుకుంటూ అంతకంతకు అధికంగా వస్తున్నాయి. విశాలమగు మైదానంలో అవి విసనకర్రవలె అర్ధ చంద్రాకారంలో ముందుకు వచ్చినవి. వాటివెనుక కాల్బలం సైనికులు వచ్చిరి.



సేవరుదళం బ్యాండు.

టాంకులు గుండ్లు ప్రేల్చ మొదలుపెట్టినవి. ఎరుపు ఆకుపచ్చ మంటలగుపడినవి. వెంటనే టుప్ టుప్ మని శత్రు తుపాకులు ప్రేలినవి. నీలి సైన్యాలు యిటూ అటు చెదరి, చిందరవందరై పారిపోయినవి. టాంకులు వారిని చొచ్చుకొని, ప్రక్కనుండి మధ్యనుండివచ్చి, నీలి సైన్యాలను (జాట్సు) వశపరచుకొన్నవి. జాట్సు చెట్లక్రింద విశ్రాంతి తీసుకొంటూ సిగరెట్లు కాల్చుకొనుచుండిరి.

టాంకులు గెలిచినవి. వాటికి కొండలుగాని, నీరుగాని, గరుకు నేలగాని ఏదీ అడ్డు లేదు. ఎంతైన శకటాలు విజయంపొందేవరకు త్రోచుకొనిపోతాయి.

సాయంకాల టిఫిని రోడ్డుమీదుగా వస్తూ, బ్రిటిషు సైనికులు శత్రు స్థలములందు శేషం లేకుండా తుడిచివేయుట, శత్రువులు సముద్రతీరానికి పారిపోకుండా కైకొన్న చర్యలు గాంచితిమి. ధూళి మట్టితో నిండియుండి, అమితంగా అలసియుండి, క్షవరంలేని గడ్డాలపై నుదిటినుంచి చెమటలు కారుచు రోడ్డుప్రక్కన యింకో మకాముకు నడచిపోతున్నారు—వార్తాహారులు ఉక్కుతలకవచాలతోను, కండ్లకు గంతలతోను అతివడిగా ధూళిలోనుంచి వచ్చి ధూళిలో మాయమవుతున్నారు—సప్లై బండ్లు అనంతంగా పొలాలలోపడి వస్తున్నాయి. సైనికులను, ఆయుధసామగ్రిని యుద్ధరంగానికి తీసుకపోతున్న బండ్లు వరుసగా రోడ్డుపై వస్తున్నవి—ఆరు బయట సైనికులు వంటకై నిప్పు చేస్తూ, కఱ్ఱలు ఏరితెస్తూ మరునాటికి పండ్ల పుల్లలు, క్షవరం సామానులు వెదకుచు (సాయంకాలం 5 గంటలకు) అగుపడిరి—ఇదీ యుద్ధం.

ఈ యుద్ధ నాటకమును మేము చూడగల్గితిమి. సైన్యం సర్వదా సంసిద్ధంగానుంది. పగలు యుద్ధం చేస్తున్నారు. రాత్రిళ్లు క్రొత్తచోట్లకు పోతున్నారు. సైనికుల పని అవస్థ ఎట్లుంటుందో స్పష్టంగా యిచట తెలిసెను—పని, పని యింకా ఎక్కువ పని, నిద్ర ఉండదు, విశ్రాంతియుండదు, నీలిసైన్యం పూర్తిగా ఓడిపోయేవరకు అంతే !

ఒక ఉద్యోగి జరుగుచున్నదంతా మాకు బోధపరచి చెప్పుచుండెను, పబ్లిక్ రిలేషన్సు డైరక్టరువారి దిగువ ఉద్యోగులు ప్రేక్షకులమగు మా అందరిని బాగా ఆదరించిరి.

మూడు రోజులు మేమంతా డేరాలలోనుండి యుద్ధరంగాల చేరువ జీవితం ఎట్లుంటుందో అనుభవించితిమి. గవర్నరుల అడ్వైజరులుకూడ మాతోబాటు డేరాలలోనేయుండి, మా పంక్తినే భోజనం చేసిరి. అందరు భాయిభాయిగా మెలగుటకు మంచి అవకాశము. కాలం బాగా ఉపయుక్తంగా గడచిపోయింది.

# మదరాసు సేపర్సు మైనర్సు దళము.

## జమేదారు మల్లికార్జునిని ధైర్యము.

### మోల్మేను ఖాళీచేసిన యుదంతము,

జమేదారు మల్లికార్జునుడు (1402) మదరాసు సేపరులు మైనరుల దళములో క్వీ.వి.ఒ. కి చెందిన కంపెనీలోని 3 వ సెక్షను యజమానిగ 1942 వ సం॥ జనవరి 30 వ తేదిన యుండెను. ఈ సెక్షను కంపెనీనుండి వేరుచేయబడి, మోల్మేనునందు అత్యవసర సర్వీసులన్ని ధ్వంసముచేసే కార్య మివ్వబడెనని సేనానాయకు డాజ్ఞాపించెను. కంపెనీ నాయకుడగు కెప్టనూ జమేదారు మల్లికార్జునుడు సరేనని, పడవలోనుండి పైకి దుమికి జెట్టిపై నెక్కిరి. దగ్గరనున్న ఒక లారీలోని పరుపుచుట్టలన్ని ఒక గోడలాగు అడ్డుపెట్టి వాటి వెనుకనుండి శత్రువులపై గురిచూసి కొడుతూ



శిబిరం చుట్టు కావలా గుహలు కట్టుట.

కార్యమునందుండెను. సైనిక దళము మోల్మేను విడచిపోవుటకు ముందు శత్రువుకి ఉపయోగపడే కట్టడములన్ని ధ్వంసంచేయడం పూర్తి అయినాక కెప్టను యూ జమేదారు మల్లికార్జునిని అతని సైనికులను ఒక స్టీము లాంచిపైనుంచి మర్తబనునకు పంపుటకు సిద్ధంగానుండెను. అప్పటికప్పుడే జపానువారు తరుముకొనివస్తున్నారు. పడవ బయలుదేరు సమయానికి, సివిలు ప్రజలు కొందరు వెనుకపడి ఉండిపోయినవారు వచ్చిరి. సైనికులు పడవ దిగి, జెట్టీపైన నిలచి కావలా కాయుచు, ఆయుధాలు లేని ప్రజ పారిపోవుటకు అవవారు దగ్గర రాకుండా చేసి, పడవలోని ప్రజ భద్రంగా వెడలిపోవునట్లు చూచిరి. ఇంతలో జెట్టికిపైన ఎత్తుగానున్న ఒక యింటిలోనుండి ఎవడో కొట్టిన గుండుదెబ్బకు కెప్టను పడిపోయెను. జమేదారు మల్లికార్జునుడు నాయకత్వం వహించెను. కొంతసేపటికి బెటాలియను నాయకుడు వచ్చెను. ఆ తరువాత జరిగిన సంగతుల గూర్చి ఆ నాయకుడు (కమాండెంటు) యిట్లు తెలిపెను :—

మేమా పరుపుచుట్టల వెనుకనే యుండి శత్రువు నరికట్టి యుంటిమి. శీఘ్రపడవలు తిరిగి రావని

నిశ్చయంచేసుకున్న తరువాత యింక శాశ్వతంగా అక్కడ నుండుటకు వీలులేదని నేను నిశ్చయించితిని. సేవరు జమేదారు, అతని సైనికులు నేను ఆ జట్టీక్రిందకు పోయి చీకటిలో దాగొంటిని. ఎప్పటికైన ఆ క్రిందనుండే పారిపోవచ్చునను ఆశతో మోకాళ్ళవరకు బురదనీటిలో నిలచియుంటిమి. ఒక గంటయేక, జపాను సైనికులువచ్చి తమ ఫిరంగులను ఆ జెట్టీపైన ఉంచి మర్టబాను పురముపై గుండ్లు ప్రేల్చుచుండిరి మేమా జెట్టీ క్రిందనే యుంటిమి కదులుతే చూస్తారని భయం. చీకటయింది. కొంతసేపటికి ప్రక్కనున్న స్టీలు బ్రదర్సు కంపెనీవారి కాంపౌండులో ఏదో శబ్దాలు వినబడుచున్నవి. ప్రక్కన చూతును గదా, జమేదారు అతని మనుష్యులు లేరు. పారిపోవుటకు ప్రయత్నించి వారు శత్రువుకంట బడియుందురనుకున్నాను ఇంకా శబ్దాలు వినబడుతున్నాయి. కనుక అదేమిటో తెలుసుకుంటామని తోచి నెమ్మదిగ వెళ్ళి ఒక గోడకన్నంలోనుండి చూతునుగదా ఆశ్చర్యం వేసింది. సేవర్లు తమ జమేదారు ఉత్తరువుల ప్రకారం పెట్రోలు పీపాలతో ఒక చిన్న దోనెపడవ కట్టుచున్నారు జమేదారు సన్నగొంతుకతో వాళ్లకు ఉత్తరువులిస్తు పని చేయించుచున్నాడు. పని పూర్తిచేసి దానిని నీట దింపిరి కాని జమేదారుకి సంతృప్తికరంగా లేనందున, మళ్లా ఒడ్డుకితెచ్చి, కొన్ని కన్నాలుంటే కప్పి తిరిగి నీటిలో దింపిరి. జమేదారుకి సంతృప్తి కలిగినపిమ్మట, నావద్దకువచ్చి "రాఫ్టు తయారు హోయి సాహెబ్" అని చెప్పెను. మేమంతా అందులో ఎక్కి నెమ్మదిగా పోతిమి. తెడ్లు వాడితే నీరు చప్పుడై శత్రువుని ఆకర్షిస్తామని, తన సేవరులను దుస్తులుతీసి త్రోయవలసినదిగా జమేదారు ఆజ్ఞాపించెను.

"శత్రుముఖాన, శాంతం మనోనిబ్బరం కలిగి, మంచి యుక్తి ఆలోచనగల్గి జమేదారు మల్లికార్జునుడు అందిరికన్న మిన్న యనిపించుకొనెను. తన సేవరులకు ఆదర్శనీయుడుగ నుండుటయేగాక, నన్ను మరియిద్దరు ఆఫీసరులను, తన సైనికులను తన తెలివితేటలచేత రక్షించగల్గెను."

## వంటవాని కార్యదీక్ష.

### 1851 లక్ష్మణను, వంట ఐ.టి.

మోల్మేనునుండి 1942 వ సం॥ జనవరి 31 వ తేదిన పూర్తిగ సైన్యం విరమించిన పిమ్మట క్వీ.వి.ఓ. మదరాసు సేవర్లు మైనరుల 2 వ సెక్షను మర్తబనులో పనిచేసెను.

సైన్యాలకు స్టోర్సికి మోల్మేనునుండి మర్తబానుకి నది దాటుటకు లాంచీలు బల్లకట్టుట ఏర్పాటు చేయబడినవి. సివిలు ప్రజలకు వెనుకబడి ఆలస్యంగా వస్తున్నవారికి వంటసాలలు భత్యాలిచ్చే స్థలములు ఏర్పాటుచేయబడెను. లక్ష్మణను అను వంటవాడు అటువంటి వంటసాలలలో ఒక దానియందు పనిలో నుండెను.

చాల ప్రతికూలపరిస్థితులలో అనేక కష్టాలకోర్చి ఆరు రోజులు లక్ష్మణను యీ వంటసాలను నడిపించి, తన సైనికులకేగాక ఆ త్రోవను వచ్చిన వారందరికి అన్నం పెట్టుచుండెను.

చివరకు 1942 వ సం॥ జనవరి 31 వ తేదిన మోల్మేనునుండి పోతున్న ఆఖరు పడవపై శత్రువులు మరఫిరంగులు నేలఫిరంగుల ప్రేల్చిరి. ఈ పడవలు మర్తబాను చేరేసరికి నానాభీభత్సంగా నుండెను. పడవలలోనుండి వడిగ ఒడ్డుకి పోవుటకు ప్రతివారు యితరులను త్రోసేస్తున్నారు. ఆ సమయాన జపానువారు జట్టీపై గుండ్లప్రేల్చి పని పూర్తిచేసుకుంటున్నారు. కొద్ది నిమిషాల క్రిందట అల్లకల్లోలంగా నుండిన చోటు ఖాళీఅయి ఒక్క మనిషికూడ కనబడలేదు. పడవలనుండి వస్తున్న సేవరులనందరిని ప్రోగుచేసి నేను (కెప్టను) నా కంపెనీవద్దకు తీసుకపోవుచున్నాను. తరువాత వీరిని జెట్టీదగ్గరకు యింకేమయిన లాంచీలుంటే శత్రువుకి చిక్కకుండా తగలపెట్టుటకై తీసుకపోతిని. అక్కడ వంటవాడు లక్ష్మణను వేడిఅన్నము పొగలువస్తున్న పప్పుకుండ పట్టుకొని సిద్ధంగా నుండుటచూచి నిర్ఘాంతపోతిని ఆ ఉదయమంతా శత్రువుల గుండ్లు పడుతూవుంటే, అందరు పారిపోతే ఇతను మాత్రం వంటపని చేస్తూ అక్కడే వున్నాడు. "శాబాస్" అని క్లుప్తంగా అతనితో మాట్లాడి మా మనుష్యులతోగూడ అతన్ని కంపెనీ స్థానానికి తీసుకపోతిని. అక్కడ సరంజామా అంతయు నాల్గు రైల్వే పెట్టెలలోపెట్టి పంపవలసియున్నది. ఈ పనిచేయుటకు 6 గురు సేవరులు మాత్రంగలరు. మిగిలినవారంతా జెట్టీలవద్ద పనిచేస్తున్నారు. ఆ ప్రాంతాలలో గుండ్లు తెరిపిలేకుండా పడుతున్నా, యీ ఆర్గురు సేవర్లు వంటవాడు లక్ష్మణు సహాయంతోగూడ త్వరలో రైలు పెట్టెలలో సామానంతా పడవేసిరి.

"1851 ఐ.టి. వంటవాడు లక్షణను అననుకూల పరిస్థితులలో, కష్టాలకోర్చి, గుండ్లు పడుతూవుంటె బెదరక తన విధిని తాను, ధైర్యస్థుడగు సిపాయిలు యీర్ష్యగొనునట్లుగా, నిర్వహించెను."

# మదరాసు గార్డుల పూర్వచరిత్ర.

1780 వ సం॥న మదరాసు సైన్యంలో ప్రత్యేకదళంగా యీ సైనికదళం తయారుచేయబడినది. అపుడు మదరాసు సైన్యం అనేక కోటలు ముట్టడిచేయవలసియున్నందున, రోడ్లు వేయుట మున్నగు ప్రారంభ కార్యములు బాగా జరుగుటకై చెరి 115 మందిగల రెండు కంపెనీల సైన్యం తయారు చేయబడెను. అదివరకు "మామూటీలు" అనబడు సివిలు పయనీరు తాత్కాలిక దళములకు బదులు యివి తయారు చేయబడినవి.

ఈ ప్రారంభదళము త్వరగా అభివృద్ధిచెంది 1823 సరికి 2,400 మందిగల రెండు బెటాలియనులయ్యెను. ఒక్కొక్క బెటాలియనులో 8 కంపెనీలుండెను. అపుడు వారి పనికూడ మారింది. ఎక్కువ సాంకేతిక కార్యములు నేర్పుతోకూడిన పనులు చేయవలసియుండెను. కనుక యీ దళములు 1831 లో పునర్విభజన చేయబడినది. 8 కంపెనీలు మార్చివేయబడినవి. రెండో బెటాలియనుగూడ 1833 లో మార్చబడినది. అంతవర కది పయనీర్సు అనబడుచుండెను.

క్రొత్తగ నేర్పడిన సైనికదళమునకు మదరాసు ఇంజనీర్లకు చెందిన కెప్టను లావేగారు ప్రధమ నాయకుడుగ నియమింపబడిరి. ఇక ముందు ఉద్యోగులందరుగూడ మదరాసు ఇంజనీరు దళమునుండే గైకొనబడవలెనని నిర్ణయించబడెను. 1885 లో రాయలు ఇంజనీరులు యీ దళమునకు నాయకులుగ నియమింపబడుట జరిగెను. అప్పటివరకు ఇందలి సైనికులు సిపాయిలనబడుచుండిరి. కాని 1885 నుండి వీరికి సేపరులను నామకరణం వచ్చెను. యీ సేపరులకు మంచి పనిముట్లు ఇచ్చి క్రమేణ యెక్కువ నేర్పుగల పనులు నేర్పబడుచుండెను. వంతెనలు కట్టుట, యుద్ధరంగంలో యితరవిధములగు పనులు చేయుటకు అప్పుడప్పుడు యిందలి యూరోపియను ఉద్యోగులు ఇంగ్లాండు పంపబడుచుండిరి. 1861లో నాను-కమీషన్డు రాయలు ఇంజనీరులను శిక్షణపొందినవారిని నియమించే ప్రస్తుత విధానము అమలునకువచ్చెను.

1876 లో విక్టోరియా రాణి యీ దళమునకు "క్వీన్సు ఓను" (రాణిగారి స్వంత) సైన్యం అను పేరున్న అందు కనుగుణ్యమగు సున్నా గుర్తు ధరించుటకు అనుమతించెను. 1923 సం॥లో క్వీన్సు ఓను (క్వి. వి. ఒ.) మదరాసు సేపర్సు మైనర్సు అనియు, 1941 లో "గ్రూపు ఇండియను ఇంజనీర్సు" అను పేరు చేర్చబడెను. 1933 నుండి ఇండియను ఇంజనీర్సు కోరులో భారతీయులు రాంకుల్లో చేర్చుకొనబడుచుండిరి.

1933 లో మదరాసు పయనీర్సు దళము చెదరిపోయెను. వారి బిరుదు చిహ్నములు యీ మదరాసు సేపర్సుకి అందజేయబడెను. అందలి 930 మంది యిందు చేర్చుకొనబడిరి.

గత 162 సంవత్సరములలో యీ దళము యొక్క కంపెనీలు మూడు దేశాలలో యుద్ధం చేసి కీర్తిగడించినవి. చీనాలో 1840-42 పని చేసినందుకు "ఇంపీరియలు క్రౌను గోల్డెను డ్రాగను" చిహ్న మొసంగబడెను. 1801 లో ఈజిప్టునందు పనిచేసినందుకు "ఈజిప్టు స్పింక్సు" గుర్తు ఒసంగబడెను.

ఈ మదరాసు దళం ఇండియాలో ఈస్టు ఇండియా కంపెనీ యుద్ధాలలోను, బర్మాను వశపరచుకొన్న యుద్ధంలోను పాల్గొనుటేగాక, సైనిక తిరుగుబాటు సమయముల రాజభక్తితో ప్రవర్తించి, ఆఫ్గనిస్థానం, సరిహద్దు ప్రాంతాల యుద్ధములందుగూడ పాల్గొనెను. 1914-18 యూరోపు యుద్ధంలో ఫ్రాంసు, ఫ్లాండర్సు, ఈజిప్టు, పాలస్తీనా, ఇరాకు, తూర్పు ఆఫ్రికాలందు యుద్ధరంగాలలో పోరాడెను.

1780 లో యీ దళమునందు 250 మంది యుండిరి. 1914-18 యుద్ధంనాడు 1816 నుండి 7,000 వరకు పెరిగెను. ఇపుడు భారతీయ సైన్యం ఏమూలకు పోయి పనిచేసినా అచట మదరాసు దళంయొక్క యూనిటులు గలవు.

చన్నరాష్ట్రంలో అన్నిమూలలనుండి క్రొత్తవారు యీదళమునందు చేర్చుకొనబడుచున్నారు. వారికి సైనిక శిక్షణతోబాటు, ఇంజనీరింగు ట్రెయినింగు ఒసంగబడును. అందరికి ఏదో ఒక వృత్తి నేర్పబడును. కొంతమందికి మోటారు నడుపుటకూడ నేర్పబడును.

ఈ మదరాసు దళమును గురించి 1888 లో వైకౌంటు వుల్సేలే సేనాని యిట్లు ప్రశంసించియుండెను :—అన్ని విషయాలు కలిపిచూచిన అత్యుత్తమ దేశీయ సైనికులు, ఇండియాలో

(తరువాయి 22 వ పుటలో.)

# మదరాసు గార్డులు ఎ.ఎఫ్.ఐ.

మదరాసు చేరువ శెంతోములో పోర్చుగీసు జాతివారు మొదట వచ్చిదిగి యిప్పటికి 420 సంవత్సరములు గడచినవి. తరువాత కూమునది ఒడ్డున ఇసుకతిన్నెలో ఫ్రాంసిసుడేగారు దిగి ఈస్టు ఇండియా కంపెనీవారికి చంద్రగిరి రాజా యిచ్చిన జాగాలో కోటగట్టి 320 సంవత్సరములు గడచినవి. అప్పటినుండి ఆంగ్లో-ఇండియనులు మదరాసు అభివృద్ధికి దక్షిణ ఇండియా అభివృద్ధికి చాల పాటుబడుచుండిరి. వారిలో అనేక ప్రముఖులు చాల యుద్ధాలలో పాల్గొనిరి : దక్షిణ ఇండియాలో శాంతిచేకూరినాక పరిపాలనయందు, వివిధశాఖలలోను, రైల్వేలు, వర్తకం, కర్మాగారములు అన్నింటియందు ఆంగ్లో ఇండియను డామిసైల్డు యూరోపియను సంఘములవారు తగు రీతి పాల్గొనుచుండిరి. రాజుగారి సేనలలోచేరి దేశరక్షణయందు బాధ్యత వహించాలనిగూడ కుతూహల పడుచుండిరి.

1857 వ సం॥లో ప్రమాదస్థితి సంభవించినపుడు మదరాసు గవర్నరుగానుండిన హారిసు ప్రభువుగారు, మదరాసులో ఐచ్ఛిక సైనికదళం ఒకటి ఉండాలని నిశ్చయించి మదరాసులోనున్న యూరోపియనులను ఒక ఐచ్ఛిక రెజిమెంటుగ చేర్చిరి. ఇండియా అంతకు అదియే మొదటి ఐచ్ఛిక సైనికదళం, తరువాత దానిపేరు అనేక విధముల మారినది. "మదరాసు ఇన్ఫెంటరీ వాలంటీర్సు", "ఇంఫెంట్రీ వాలంటీరు గార్డ్సు", చివరకిపుడు 'మదరాసు గార్డ్సు' అనబడుచున్నది. ఇందులో చిరకాలమునుండి ఆంగ్లో-ఇండియనులు యూరోపియనులుంటూ వచ్చిరి. దీనిలోనుండి అనేకశాఖలు బయలుదేరినవి.

1870—80 వ సం॥ల మధ్య మదరాసు గవర్నరుగ నుండిన బకింగుహాము ప్రభుపు మదరాసు ఆర్టిలరీ వాలంటీర్సు దళమును స్థాపించెను. దానికి "డ్యూక్సు ఓను" అను కితాబు గలదు. ఆకితాబు నేడు "మదరాసు కోస్టు బాటరీ" వారు గూడ ధరించుచున్నారు.



ముళ్లతీగ కట్టుట.

మదరాసు గార్డ్సుకి చెందిన మవుంటెడు కంపెనీ దక్షిణ రాష్ట్రముల మౌంటెడు రైఫిల్సుగా 1910 వ సం॥లో మారింది. 15 సం॥ల క్రిందట ఆర్టిలరీ దళంనుండి మదరాసు సిగ్నలు కంపెనీ వేరుచేయబడింది.

పూర్వం 'ఏ' కంపెనీ అంటే సైక్లిస్టుల కంపెనీ. అందు ముఖ్యంగా వైద్య విద్యార్థులుండేవారు. కాని 1904 వ సం॥లో సైక్లిస్టు

లందు లేనేలేరు, మదరాసు మెడికలు విద్యార్థులు మదరాసు గార్డులలో ముఖ్యభాగంగా నుండేవారు.

'బి' కంపెనీ యూరోపియనులది, 'సి', 'డి', 'ఇ' కంపెనీలందు ఆంగ్లో-ఇండియను లుండెను. ఇవన్నికూడిన బటాలియను నేడు పూర్తిగ యూరోపియనులు ఆంగ్లో-ఇండియనులనే కలిగియున్నది. సమర్థత ఒక్కటే ముఖ్యా దర్శంగా పెట్టుకొని ఉభయులుకలసి పనిచేయు చున్నారు.

గత యుద్ధంలో.

దక్షిణాఫ్రికా యుద్ధంలో యీ దళమునందలి కొందరు సభ్యులుపోయి పనిచేసిరి. 1914-18 వ సం॥ యుద్ధమునందు 'ఎండను' జర్మను

మదరాసు గార్డ్సు కేంద్రస్థానం 1898 వ సం॥లో చేపాకునందుండెను. 1903 వ సం॥లో ఎగ్మూరు స్టేషనుదగ్గర ఒక భవనం కొన్నారు. ఆ భవనం కొద్దిఏండ్ల క్రిందట పోలీసు ఆఫీసుకొరకు తీసుకున్నంతవరకు కేంద్రస్థానం అక్కడనే యుండెను; తరువాత మదరాసు గార్డ్సు పూర్తిగ ఫోర్టు సెంటు జార్జి కోటకు మారిరి.

వెంకటగిరి మహారాజాగారికి యీ దళముతో సంబంధంగలదు.

ఈ కాల్బలదళమున స్వయంగా యుద్ధంలో పాల్గొనుటకు నేటియుద్ధంలోనే ప్రథమవకాశం లభించెను.



మదరాసు గార్డులు నది దాటుట.

నౌక మదరాసుపై గుండ్లువేసిన పిదప మదరాసు గార్డులు వెంటనే రెండు కంపెనీలను తయారుచేసిరి. ఈ రెండు కంపెనీలు యుద్ధం జరుగుచున్నంతకాలం పనిచేసిరి. ఆఫీసరులు తమ పనులతోబాటు సైనికసేవగూడ చేసేవారు. కొందరు స్వంతపూచీపై యుద్ధరంగాలకు పోయి సేవచేసిరేమోగాని, ప్రత్యేకసైనిక జట్టుగపోలేదు. మదరాసు ఆర్టిలరీ వాలంటీరులు మాత్రం ఆంగ్లో-ఇండియను బాటరీ జట్టును మెస్పటోమియాలో యుద్ధంచేయుటకు పంపిరి.

యుద్ధం చేయుటకు పూర్తి పరికరాలతో ఒక బెటాలియను తయారగుటవలన యుద్ధంలో సేవ చేయాలను ఆసక్తి ఆంగ్లో-ఇండియను సంఘమంతకు ఎక్కువైనది. మూడేండ్లు కఠినమగు శిక్షణముపొందిన ఫలితంగా వారు భారతీయ సైన్యానికి తోడ్పడ సర్వసిద్ధంగా నున్నారు. ఇంతకన్న ఎక్కువసేవ త్యాగంచేయుటకు వారు ఏ మాత్రం వెనుదీయరు.



గౌరవనీయులగు సర్ అర్థరు హోపు, మదరాసు గవర్నరుగారు — లెఫ్టనెంటు జనరలు సర్ నియోలు బేర్సు ఫర్డు పియర్సిగారు, కె.బి.ఇ., డి.ఎస్.ఒ, జి.ఒ.సి., దక్షిణ సైన్యాధికారి.

# మదరాసు మూడవ రెజిమెంటు.

## పునరుద్ధరణ : గవర్నరు అభినందనములు.

సెప్టెంబరు 23 వ తేదిన మదరాసు ప్రజలందరికి అభిమాన విషయమగు కార్యమొకటి జరిగెను. 15 సంవత్సరముల క్రిందట రద్దుచేయబడిన 3 వ మదరాసు రెజిమెంటు పునరుద్ధరించబడెను. పూర్వము మదరాసు రెజిమెంటు ఆస్సేయిసువద్ద విజయంపొందిన నాటి వార్షికోత్సవం నాడే యీ పునరుద్ధరణ జరిగెను.

కాసండ్రైను యుద్ధ విజయంవల్ల పొందిన గౌరవముతో ఆనాటి మదరాసు సైన్యంయొక్క విజయ పతాకము నేటి సైన్యమునకు అందజేయబడెను. నాటి మదరాసీల గొప్పదనము నేడు మరల వినవచ్చుచున్నది. శ్రీరంగపట్నం పేరు మరల ప్రతి ధ్వనించుచున్నది.

నేడు మదరాసు సైనికుల కవాతునందు 92 సం॥ల వృద్ధుడు అనుభవజ్ఞుడగు భారతీయ సైనికోద్యోగి జమేదారు ఇస్మేలు ఖానుగారును, మరికొందరు ప్రాత మదరాసు సైన్యం ఉద్యోగులును గవర్నరుగారిచే గౌరవింపబడిరి. "పూర్వపు మదరాసు సైన్యం ప్రతినిధిగ నేను ఆ సైన్యంయొక్క రంగులను (సైన్యంయొక్క ప్రత్యేక చిహ్నము) క్రొత్తగ ఏర్పడుచున్న 3 వ మదరాసు రెజిమెంటుయొక్క ట్రెయినింగు సెంటరునకు, భద్రముగ కాపాడుటకై అందజేయుచున్నాను" అని ఆనాటి మదరాసు సైన్యంయొక్క బ్రిటిషు ఆఫీసరు అనుచున్నపుడు ఎవరి మనసులు ఉప్పొంగకుండును.

సుప్రసిద్ధమగు పూర్వపు మదరాసు రెజిమెంటులోని కొన్ని బెటాలియనులు పనిచేయుచున్నవి. ఇంత తక్కువకాలంలో యీ మదరాసీలు చేసిన ఘన కార్యములకు మదరాసు ప్రజలందరు గర్వింపవచ్చును.

మధుకరై యందు సెప్టెంబరు 23 వ తేదిన క్రొత్త 3 వ మదరాసు రెజిమెంటు ప్రారంభోత్సవమును మదరాసు గవర్నరుగారు జరిపిరి. ఆనాడు శిక్షణ శిబిరము తెరువబడెను. ఈ శిబిరమే రెజిమెంటుయొక్క నివాసస్థానం వారు తమ పూర్వీకుల ఘన కార్యములకుప్పొంగి, సద్సాంప్రదాయములను కాపాడుటకు గర్వింతురు. భారతదేశ గౌరమును కాపాడుటకు సమర్థత గణింప పాటుబడుదురు. భారతీయ సైన్యములో ఉద్యోగులకును సైనికులకు అన్యోన్య మైత్రి చేకూరుటకు తోడ్పడుదురు. ఇందు చేరినవారు

ఆఫ్రికా ఎడారులలో పోరాడెదరో, ఇండియా పశ్చిమోత్తర సరిహద్దులలో పోరాడెదరో భారత సామ్రాజ్యం తూర్పు తీరాన్నే రక్షించెదరో యిపు డప్పుడే చెప్పలేము. కాని వారెచటకు పంపబడి నను ప్రాత మదరాసు రెజిమెంటువారు ఖ్యాతి గడించినట్లే ఖ్యాతి గడించగలరు.

## గవర్నరుగారి ఉపన్యాసము

ఈ సందర్భమున మదరాసు గవర్నరుగారి ఉపన్యాసమునందు యిట్లు దెలిపిరి :—

“ కొంతకాలమునుండి దక్షిణదేశంనుండి సైనికులను చేర్చుకొనుట మానివేసిరి. ఇపుడు యుద్ధం వచ్చుటచే, అందువలన భారతీయ సైన్యానికి కలిగిన నష్టం తెలియవచ్చెను. దాక్షిణాత్యుడు మంచి యోధుడు కానేరడని కొందరంటారు. అది అసత్యము. మదరాసీ సైనికులు ప్రపంచంలో యింకే సైనికులకు తీసిపోరని గత యుద్ధంలోను యీ యుద్ధంలోనుకూడ అనేక సారులు రుజువైంది.

నేను యీ రాష్ట్రానికి గవర్నరుని అయినప్పటినుండి ఒక్క మదరాసు రెజిమెంటే కాకుండా ప్రాత మదరాసు సైన్యంలో అన్ని యూనిటులను పునరుద్ధరించవలెనని అధికారులతో చెప్పి ప్రయత్నించుచుంటిని. తత్ఫలితంగా నేడు ఉత్సవం జరుగుచున్నది. ప్రాత మదరాసు సైనికోద్యోగులు, నాను కమిషండు ఆఫీసరులు, సైనికులు నేటి మదరాసు సైన్యంతో కలియుట జరుగుచున్నది. నాటి బిరుదు చిహ్నములు నేటి వారి కందజేయబడుచున్నవి.

ఈ 10 వ బెటాలియనులో వైస్రాయి కమిషండు ఆఫీసరులుగాను నాన్ కమిషండు ఆఫీసర్లుగాను శిక్షణపొంది, యితర మదరాసు యూనిటులకు పనికివచ్చు ఉద్యోగులు తయారగుదురనియు, మదరాసు రెజిమెంటుకి చెందిన యితర బెటాలియనులు తయారు కాగలవనియు ఆశించుచున్నాము. ప్రాతవిధానమువలన ప్రస్తుతము దక్షిణ ఇండియాలో వి.సి.ఏ.లు, ఎన్.సి.ఓ. లు లభించుట కష్టంగానుంది.

ప్రస్తుత సమయంలో ఇండియాలో సైనికులు లభించుట కష్టమని అనే వారున్నారు. అది కేవలం అసత్యం అసందర్భమున్నూ. ఇండియాలో అన్ని ప్రాంతాలనుండి అనేకమంది క్రొత్తవారు సైన్యంలో చేరుచున్నారు. కాని వారికి నాయకత్వం వహించగల ఉద్యోగులు లభించుటలేదు. అట్టి నాయకులను ఉద్యోగులను తయారుచేయుటే యీ బెటాలియనుయొక్క ముఖ్య కర్తవ్యము. వివిధ మదరాసు యూనిటులకు వి.సి.ఓ., ఎన్.సి.ఓ. ఉద్యోగులు తగినవారు యిందు తయారుచేయబడుదురు.

సైన్యంలో ప్రతివాడు ఏ జాతిమతానికి చెందినా ఉన్నతోద్యోగం వరకు పోవచ్చును. ఈ క్రొత్తగ పునరుద్ధరింపబడిన యీ మదరాసు రెజిమెంటు స్థిరంగ నుండగలదని చెప్పగలను. మీకే పని యొసంగబడినను మీకొరకు, మీ కుటుంబాల కొరకు, మీ దేశంకొరకు, అన్నింటికన్న ఎక్కువగ మీ రెజిమెంటు గౌరవంకొరకు సంతోషంగా చేయండి. మదరాసు రెజిమెంటుకి భూత చరిత్ర మహోన్నతమైనది ; భావి చరిత్రగూడ మహోన్నతమైనది కాగలదు. ”

అని చెప్పి గవర్నరుగారు యీ సైనికదళంలో ప్రతివారికి అదృష్టం చేకూరాలని ఆశీర్వదించిరి.



ప్రాత బ్రిగేడు సైనికులను గవర్నరుగారు చూచుట.

# మదరాసు క్రొత్త బెటాలియను.

(ఒక విలేఖరి)

“మా గ్రామంలో సైన్యంలోకి పోయివచ్చిన వారు ఎవ్వరు లేనందున, సైన్యంలో చేరితే ఎట్లుంటుందో నాకు చెప్పేవారు లేరు. భోజనం సరీగా వుంటుందా? ప్రతిరోజూ దెబ్బలు కొడతారా?”

ఇలాంటి ప్రశ్నలు చన్న రాష్ట్రంలో యువకులనేకులకు కలుగవచ్చును.

కేవలం మదరాసువారేయున్న సైనిక జట్టు (బెటాలియను) నివాసమునకు నేను యిటీవలనే పోయివస్తిని. నేను చూసిందేమిటో మీకు చెపితే పై ప్రశ్నలకు జవాబు మీకే తెలుస్తుంది.

మొట్టమొదట కనబడినవానిని నిలిపి మాట్లాడితిని. అతడు కడపనుంచి వచ్చిన డి. భాస్కరు. అతని చొక్కా చేతికి ఒక తెల్ల ‘పి’ గీత గలదు. క్రొత్తగ సైన్యంలో చేరిన 20 మంది సైనికుల పెత్తనం వహించియున్నాడు. స్టోర్సులోనుండి క్రొత్త బట్టలు, బూట్లు, కంబళ్లు మున్నగునవి పెద్ద కుప్పలోనుండి తీసి వారికి సైజువారిగా పంచుటకు అతడు తోడ్పడుచుండెను. క్రొత్తవారు సైన్యంలో చేరిన కొద్ది గంటలలోనే అవన్నీ వారికిస్తారు. గ్రామాలలో ఎన్నడు వారెరుగని క్రొత్త రకాల దుస్తులు తొడుక్కోడం అతడు వారికి నేర్పును. అతడు రెండు నెలలనుండే సైన్యంలో చేరెనని చాలా హాయిగ వున్నదని చెప్పెను. కనబడగానే అతి చురుకుగ అతడు చేసిన సలామును బట్టి అతని ముఖారవిందమును బట్టి అతడు తన శిక్షణ కాలంలో ఒక క్షణంకూడ వృథా చేయలేదని తెలుసుకోవచ్చును.

ప్రక్క గదులో రేషను స్టోరు గలదు అచట నొక ముసలి సిపాయి రెండు వరుసల మెడల్సుతో రేషన్సు (భత్యాలు) యిచ్చుటకు వేచియున్నాడు. అతని పేరు హావల్దారు రామస్వామి; బెంగుళూరులోని మైసూరు పోలీసు లైన్సునుండి వచ్చెను గత యుద్ధంలో పనిచేసి వృద్ధుడయినా యిపుడు మళ్లా యుద్ధలో సేవచేయవచ్చెను, అతడు యుద్ధం చేయడానికిగూడ వైద్య పరీక్ష చేసినా సమర్థుడుగానే యుండెను. “మా రాజుగారికొరకు పోయి యుద్ధం చేయుటకు ఏనాడు అనుమతించెదరా యని ఎదురుచూస్తున్నాను” అని అతడనెను.

తరువాత నేను కవాతు స్థలమునకు పోతిని. అచట నె 214474 రు హుస్సేను ఖాను కనబడెను. అతను తిరువాంకూరు సంస్థానంలో వడసైరా గ్రామ నివాసి. అతడు యితర సైనికులకు పారాలు నేర్పే పనిలో నున్నాడు. అతడు సైన్యంలో చేరి ఐదు వారాలే అయినందున అపుడే ఉపాధ్యాయుడయ్యెనా యని ఆశ్చర్యంవేసింది. అతడు చాల మంచివాడు. అతడు తన మనుష్యులను నడిపించే పద్ధతిచూస్తే త్వరలో తన చొక్కాపై ఒకటి రెండు గీతలు కుట్టించుకోగలడని తోచింది.

పెక్కుమంది సైనికులు చొక్కాలు లేకుండా కుప్పి గంతులు వేయుచు ఆటలాడుకొనుచున్నారు. వారంతా చాల ఉల్లాసంగా నవ్వుముఖాలతోనున్నారు; చాల పుష్టయిన శరీరాలు కలిగియున్నందున వారికి భోజన సదుపాయాలు బాగున్నాయని అపుడే ఆరోగ్యాభివృద్ధి చెందుచున్నారనియు తెలియగలదు; పై ప్రశ్నలకు ప్రత్యుత్తరం రాగలదు.

వారిలో పెక్కండ్రకు కొన్ని నెలల శిక్షణ గలదు. వారిలో చాలమంది మలయా బర్మాల నుండి వచ్చినవారు గలరు. వారు లారీలు నడిపించుట, రోడ్లు కట్టుట, ప్రేలుడు బాంబులు మున్నగునవి ఉపయోగించుట, సైకిళ్లు తొక్కుట మున్నగు పనులు నేర్చుకొనుచున్నారు. ఇతరచోట్ల పనివారందరు తమ తమ పనులు చేసుకొనుచున్నారు. అందరును తేనెపట్టులోని ఈగలవలె తీరిక లేక పనిలోనున్నారు. సోల్జరులు చేయవలసిన అనేకవందల పనులలో నిమగ్నులయి యున్నందున అదివరకు కలిగిన సిపాయి జీవితం గూర్చిన సందేహాలుగూర్చి యిపుడు యోచించుటకే తీరిక లేకుండయున్నారు.

నే చూచినవారందరు చాల శ్రద్ధగ ఆనందోత్సాహాలతో పని చేస్తున్నారు కనుక, మదరాసీలందరు యీ ప్రకారమే ఉండేటట్లయితే యిపుడు చాల ఎక్కువగ చేర్చుకొనబడుచున్న మదరాసీలందరును, పూర్వముండిన మదరాసు సైనికదళం పేరుప్రతిష్ఠలు కాపాడుటయే కాక క్రొత్త ఖ్యాతినిగూడ గడించి భారతీయ సైన్యంలో ఉన్నతస్థానం వహింతురనుటకు నా కెట్టి సందేహం లేదు.

---

[17 వ పేజి తరువాయి.]

నేను చూసినంతవరకు, మదరాసు సేపరులే, ఫిరంగులు ప్రేలుచుండ శాంతంగానుండి ఎంతటి ప్రమాదానికైనా ఖాతరుచేయక, సుశిక్షితులై తమ దళంగూర్చి గౌరవం గల్గియుండుటచేత, అన్ని సందర్భాలలోను వారే ప్రథమ తరగతి సైనికులుగ గుర్తింపబడిరి.

# విదేశాలు చూచిన భారతీయ శిపాయి.

## యుద్ధానంతరం గ్రామ జీవితమును బాగుగ అభివృద్ధిచేయును.

(ఒక భారతీయ విలేఖరి)

భారతీయ సిపాయిలు విదేశాలు చాల తిరుగుట వలన కలిగే మేలు పలువురు గుర్తింపలేరు. నేను పలువురు సిపాయీలను వారు ఇండియా విడచునపుడు ఆ రేవులవద్ద చూస్తిని. తరువాత ఏడాది గడిచినాక ఆఫ్రికాకువచ్చి యిక్కడ వారినే చూచి మాట్లాడితిని. వారు అనేకవిధములగు జీవితం గడిపిరి. బొంబాయి, కరాచీ రేవులందు వారికుండిన దిగులు చూపులు యిక్కడగుపడవు. వారిలో పెక్కండ్రు అదివరకు సముద్రం చూచి ఎరుగరు. ఇతరులు పెద్ద నగరంలోనుండే జనుల కోలాహలానికే విభ్రమ చెందిరి.

ఇపుడదంతా వారికి ప్రాత చరిత్ర. వారికి ఆత్మవిశ్వాసము ఎక్కువయింది. ఒక ఏడాది సైనిక జీవితం గడిపినాక వారు అదివరకుకన్న దృఢంగాను ధైర్యంగాను కనబడుతున్నారు. వారి నడకలోనే ఒకవిధమగు స్వాతంత్ర్యభావం అగ పడుతుంది. తాము చేసిన మంచి ఘన కార్య ములగూర్చి వారికి తెలిసినట్లుండురు. సేనా నాయకుల పొగడ్తలు వారికి ప్రోత్సాహం కలి గించి, పరిశుభ్రంగా ఆరోగ్యంగా నుండుటకు ఎక్కువ కృషిచేస్తున్నారు.

వేలకొలది మన సైనికులు ఆఫ్రికా ప్రాంత ములలోను యితర చోట్లకు పోవుటవలన కలిగిన జ్ఞానం, యుద్ధానంతరం శాస్వతంగా లాభించును. అంతేకాక ముమ్ముందు భారతీయ గ్రామ జీవితాభి వృద్ధికి ఎక్కువ తోడ్పడును.

మన సైన్యాలు చాల క్రొత్త ప్రదేశాలను, క్రొత్త ప్రజలను చూచినవి. వివిధరీతుల అభి వృద్ధి చెందుచున్న ఆధునిక నాగరికతను చూచిరి. ఈజిప్టులోని కైరో అలగ్జాండ్రియా నగరాలందు తూర్పు దేశాలు పాశ్చాత్య దేశాల కలయిక జీవి తమును చూచిరి. పాలస్తీనాలో యూదజాతి ప్రజ ఆ దేశాన్ని తిరిగి పాలేరునేతేరుగ మార్చి వేయుచున్నారు. వారి పరిశ్రమలనుచూచి మన వారు మెచ్చుకొనిరి. ఇరాకులో గ్రామీయులు తమ మాతృదేశంలో గ్రామీయులుకన్న పేదగ నుండుట చూచి విచారించిరి.

ప్రయాణంవలన తెలియకుండానే జ్ఞానం కలు గుతుంది. ప్రతిదినం చూచే క్రొత్త ప్రదేశం క్రొత్త తావులును, పుస్తకాలున్ను పటాలున్ను చూపలేని వింతలు చూపి మనస్సులో హత్తుక పోయినట్లు చేయును. సైనికులగుటచే వారు ఒకచోటనుండి యింకొచోటికి తరుచు మార్చబడి వేరువేరు దేశాల జీవిత పరిస్థితులను గమనించి, మిత వ్యయం కలిగి కష్టపడి పనిచేయుచు రేపటి గూర్చి ఆలోచించుచు యుండుటవలన ఎంత మేలుకలదో తెలుసుకొనిరి.

### కొందరి గూర్చి వివరాలు.

ఇండియాలో సైనికులు ఒకే రాష్ట్రంనుండి గాని, వీరత్వంగల ఒకే జాతినుండిగాని గత యుద్ధసమయంలోవలె యిపుడు చేర్చుకొనబడ లేదు. ప్రతి తాలూకానుండి కొందరు సైనికు లుగ చేరిరి. ఉత్తరాన కాష్మీరు నేపాలులనుండి దక్షణమున కొచిన్ కన్యాకుమారి అగ్రమువరకు గల ప్రతి రాష్ట్రంనుండి సైనికులు చేర్చుకొన బడిరి. బెంగాలీలు, బెలూచీలు, డక్కనులు, మదరాసీలు అందరు కలసి సైన్యంలో నున్నారు. కావున యీ సైనిక సహచర్య విద్యాలాభం ఇండియా అంతటికి, వారు తమ గ్రామాలకు ఇండ్లకు మరలిపోయినపుడు కలుగును.

దూరానవున్న సైప్రెసులో-శాంతిసమయంలో దూరదేశమే అయినా, అతిత్వరగ వృద్ధిచెందు చున్న మన సైన్యానికి దూరం కాదు-నేనొక చిన్న కుర్రవాని చూచితిని. బొంబాయి రాష్ట్రం లో సతారాలో ఒక పొలం కూలీ కుమారుడగు లక్ష్మన్‌బోసలే అతని పేరు. స్కూలులో నేర్చు కొన్న కొద్దిపాటి మరాటి ముక్కలు తప్ప అతను విద్య నేర్చుకోలేదు. తన గ్రామంలో పొలంలో ఉదయంనుండి సాయంకాలంవరకు కష్టపడి, ఎట్టి వింతలులేని స్దబ్దు జీవితం అతడు గడిపియుం డును. తన తండ్రితాతలవలెనే, తన చిన్న పెళ్లాంతో ఒక గుడిసెలో పడియుండును. మహా పోతే పునాకో లేక బొంబాయికో జీవితంలో ఓసారి పోయియుండును.

ఇపుడటువంటి జీవితం అతనికి లేదు. బొంబాయే కాదు, సముద్రాలుదాటి ప్రపంచంలోని అనేక ముఖ్య నగరాలను అప్పుడే చూచెను. తన పురాతన గ్రామంనుండి కైరోవంటి మహాపట్టణం కట్టేటంతటి తెలివితేటగల అభివృద్ధి మానవ జాతికి ఎట్లు కలిగిందా యని అతడు యింకను ఆశ్చర్యపోతూవుంటాడు. ఈజిప్టులోను సైప్రె సులో అనేక నెలలుండే సరికి, తన గ్రామంలో తమ పెద్దలు యింకను ఎంత వెనుకపడియున్నా రో తెలుసుకుంటున్నాడు.

ణంవలన అతని వైఖరి మారింది. క్రొత్త ప్లానులు, సంస్కారములంటే యిపుడాతనికి యిష్టం. సైన్యంలో అతను పొందిన శిక్షణ వలన, స్వతంత్రించి ఏపనైనా చేయగలడు, అధి కారంగూడ చెలాయించగలడు. అతడు ఉన్నత జీవిత విధానం అలవరచుకొన్నందున తప్పక తన గ్రామంలో జీవిత విధానం మార్చుటకు ప్రయత్నించును.

ఇటువంటి యువకులు తిరిగి స్వగ్రామాలకు పోయి క్రొత్త అనుభవ విజ్ఞానములను వెదజల్లగల



వార్తాహరి.

అతడు, యుద్ధానంతరం తన చిన్న గ్రామ మగు సతారాకు మరలివస్తే, ఆ గ్రామం అతని వివిధానుభవంవలన లాభం చెందును. సైప్రె సులో వ్యవసాయదారులు ఎంత యిమ్మోగ తక్కువ ఖర్చుతో సాగుచేస్తున్నారో చెప్పును— మొక్కలు ఎట్లు నాటుతారో, క్రొత్తరకం నాగళ్లు గుర్రాలతోను లాగబడుచున్నవని, మోటారు ట్రా క్టరులు ఉపయోగిస్తున్నారని చెప్పును. ప్రయా

వారు ఎన్నో వేలమంది కలరు. వారి సైనిక శిక్షణమువలన అలవరచుకొన్న క్రమజీవనము, ధైర్యము, కష్టసహిష్ణుత, భారత భావి గ్రామ జీవితమును మార్చివేయుటకు తోడ్పడగలవు. సంచారంవలన అలవడిన విశాలదృష్టి, యుద్ధా నంతర పునరుద్ధరణ సమస్యల పరిష్కారమునకు తోడ్పడును.

# ధైర్యం విశ్వాసం.

## ఒక మహారాజు, నౌఖరు కథ.

కేశవుని తల్లి ఆతని 8 సం॥ యీడులో చని పోయెను. తండ్రి మరోపెళ్లి చేసుకోడంవలన కేశవునికి సుఖం లేకుండెను.

కేశవు నివసించు సంస్థానంయొక్క మహా రాజు ఆతనిపై దయదలచి, ఆతన్ని తన మందిరంలో నౌఖరుల మధ్య నొకడుగా పెంచుకొనెను. కేశవు పెద్దవాడవుతున్న కొద్ది మహారాజాగారికి చేరువై, నమ్మిక బంటయ్యెను. ఆతడు గుర్రపుస్వారియు, తుపాకి ప్రేల్చుటయు నేర్చెను. మహారాజాగారు వేటకు పోవునప్పుడు వెంట వెళ్లేవాడు. ఒక వేటయే యేమిటి సర్వదా మహారాజుగారి వెంటనీడవలె ఉండును.

ఇంతలో యీ యుద్ధంవచ్చింది. మహారాజాగారు తమ సంస్థానం పరిపాలన మహారాణిగారికి ఒప్పగించి, తాను భారతీయ సైన్యంలో నొక పెద్ద ఉద్యోగిగ శిక్షణపొందుటకు వెళ్లెను.

మొదట నాతడు ఇందోరులో కాడెటు స్కూలునందు చదివెను. కేశవు ఆతనివెంట నుండెను. తరువాత నాతడు మావునందున్న ఆఫీసరుల ట్రెయినుంగు స్కూలునకు పోయెను. అపుడుకూడ కేశవుడు వెంటనుండెను. చివరకు మహారాజాగారు ఆ పాఠశాల యందు తీర్ణుడై, రాజుగారి కమిషను ఉద్యోగంపొంది, రెజిమెంటలు ట్రెయినింగు సెంటరుకి పోయిరి. కొద్ది కాలమయినపిదప, అతడు తన బటాలియనులో చేరి విదేశాలకు పోవలసియుండెను. అతని వెంట స్వంత నౌఖరు (ఆర్డర్లి)ను తెచ్చుకొనుటకు అనుమతించబడెను. విదేశాలకు పోయే ముందర సంస్థానం వ్యవహారాలు చక్కబెట్టుకొని, స్వంత నౌఖరుని ఎంచి తెచ్చుకొనుటకు తన రాజ్యానికి పోయివచ్చుటకు కొద్ది రోజులు సెలవుతీసుకొనెను. తన స్వంత అంగరక్షకులలో అనుభవంగల వృదుడు హవల్దారునొకని వెంట యుద్ధానికి తీసుకపోదలచెను.

### కేశవుని విన్నపం.

ఆ మాటవిన్న కేశవు మహారాజువద్దకుపోయి తనను వెంట తీసుకపొమ్మని కోరెను. ఆతడు



కేశవు ఫోటో.

చిన్నవాడనియు, సిపాయిల అనుభవం లేనివాడనియు అందుచే యుద్ధరంగానికి రావీలులేదనియు మహారాజు చెప్పెను. యువకుడగు కేశవుడు ప్రతిమాలెను, కాని మహారాజెంతమాత్రం అంగీకరించలేదు. కేశవుడు యేమి చెప్పజాలక వెడలి పోయెను.

మరునాడు కేశవు మహారాజువద్ద శాస్వతంగా సెలవు పుచ్చుకొనుటకు వచ్చెను. తిరిగి మహారాజు వచ్చుసరికి తాను సంస్థానంలో నుండను కనుక యిప్పుడే సెలవిప్పించమని ఆతడు కోరెను. ఏమని రాజుగారడుగ, ప్రజలంతా తనను దెప్పుతారనియు, పందులవేట లేళ్లవేట సమయాల్లో రాజుగారి వెంటనుండి సుఖజీవనం గడిపిన కేశవుడు యుద్ధ సమయంలో ప్రమాదానికి వెరచి వెంటపోలేదంటారు. అందుచేత సంస్థానంలో నుండక వెడలిపోతాను " అని కేశవుడనెను. మహారాజు మనసు యీ మాటవలన కరిగిపోయింది. కేశవుని వెంటతీసుకపోవుట కంగీకరించెను. కేశవుని సంతోషానికి అంతులేదు. వెంటనే తయారయి, రాజుగారితో ట్రెయినింగు సెంటరుకిపోయి, రాజభక్తి ప్రమాణంగైకొని, ఆర్డర్లీ దుస్తులు సామాను తీసుకొని తన యజమానివెంట విదేశాలకు వెడలిపోయెను.

### ఎడారిలో.

మహారాజాగారు ఆఫ్రికా పడమటి ఎడారి సైన్యంలో చేరినపుడు నివశించుటకు వారికో గోయి, వారి సేవకుడగు కేశవునకొక గొయ్యి

యిచ్చిరి. కేశవు డట్లుండుననుకోలేదు. అందు కంగీకరింపలేదు. తన యాజమానికి తగిలే గుండు ముందు తనకు తగిలి యజమానికి తగ లాలని అతని యుద్దేశం. అందుచే వేరే బసలో నుండ నొల్లకుండెను. మిలటీ పద్ధతులలో యిట్టి పద్ధతి ఎరుగరు. పెద్ద ఉద్యోగిచెంత అతని ఆర్డర్లీలు పండుకోకూడదు. కాని కేశ వుని భక్తి అటువంటిది. కావున అతని విషయం ప్రత్యేకంగానెంచి అనుమతించబడెను. అప్పటి నుండి విదేశాలందున్నంత కాలం కేశవుడు తన మహారాజు కాళ్లవద్దనే పండుకొనుచుండెను.

ఒకసారి ఈ మహారాజు తన సైనిక విధి ప్రకారం బటాలియను ఆఫీసరుగ టాంకు విధ్వం సక ఫిరంగితో 8 మైళ్ల దూరంపోయి శత్రు టాంకులు వచ్చేత్రోవను కాపలా కాయవలసి వచ్చెను. అందున్న కష్టాల నెరింగిన వాడగు టచే ఆ మహారాజు కేశవుని బసలో విడువదలచి, ఆ విషయం ఆతనికేమి చెప్పలేదు.

సాయంకాల మగుసరికి మహారాజు కనబడక కేశవుడు అందరిని అడుగుచు వెదకి తబ్బిబ్బ య్యెను. ఏదో ప్రమాదమగు చోటికి పోయి యుండునని గ్రహించి, చివరకు సుబేదారు మేజ రునిపోయి ధైర్యంగా అడిగెను. ఆతడు ఆశ్చ ర్యంచెంది చెప్పివేసెను. తానచ్చోటికి పోవ అనుమతిమ్మని కేశవుడు వేడెను, అందుకు వీలులేదని చెప్పగా పెద్ద గొడవచేసెను. సుబే దారు మేజరు చివర కంగీకరించి, మహారాజున్న చోటికి పోవుచున్న మోటారొకదాని చూపి ఎక్కి పొమ్మనెను. రాత్రి 9 గంటలకు కేశవుడచటచేరి, తన సంచిలో స్వామికి ఆహార పదార్థములు పానీయము తెచ్చియిచ్చెను. రాత్రంతయు మహా రాజుకేమి అపాయం కలుగునోయని లేచి చూచు చుండెను.

ఇది జరిగినాక మహారాజెక్కడికి పోతే కేశ వుడక్కడకు పోవాలనుట నిశ్చమయిపోయింది.

ప్రమాదాలు తప్పుట.

ఇంతలో కొద్ది కాలానికి వారి సేన శత్రు సేనను డీకొనవలసివచ్చెను. గుండు దెబ్బలు ఏతన్నవచ్చుచుండినను మహారాజునకవి తగుల కుండా కేశవు డడ్డుపోవుచుండుటను అందరు గమనించిరి. ఒకటి రెండు సార్లు వారుభయులు చాల కష్టంపై ఆశ్చర్యకరంగా తప్పించుకొనిరి. ఎట్లయినను వారు అదృష్టవంతులే. దెబ్బ తగుల కుండ విశ్రాంతి శిబిరం చేరుకొనిరి. అక్కడ నుండి మహారాజాగారు స్వసంస్థానికిపోయి ఎట్టేటు వ్యవహారాలేవొ పరిష్కరించుకొనవ సెలవొసంగ బడిరి. అందుచే వారు విమానంపై ఇండి యాకు పోయిరి. కేశవుడాతని వెంటనుండ వలసినదే కనుక విమానంలో ఆతనికిగూడ ఒక స్థాన మొసంగబడెను. యజమాని నౌఖరు యిద్దరు సుఖంగా యిల్లుచేరిరి.

ఈ చిన్న కథ విశ్వాసం ధైర్యములను బోధిం చు పురాణ గాథవంటిది. కనుక దీని గ్రంథస్థం చేయక విడువరాదు. తాత్కాలికంగా తన మహా రాజభోగములను విడచి యుద్ధరంగంలో కఠిన నివాసమున కోర్చి ప్రాణత్యాగమునకు తెగించి తనవంశ మర్యాదను తమ పూర్వీకుడగు శివాజి చక్రవర్తి సాంప్రదాయం కాపాడిన ఆ మహా రాజు లెఫ్టనెంటు సర్ విక్రమశింగురావు పవ రు, దేవాసు సీనియరు మహా రాజు ; ఆతని భక్తుడగు సేవకుడు నె 18630 రు కేశవ పాం డురంగ భోస్లే , వారు పనిచేసింది 5 వ మహా రాటా లైటు ఇనుఫెంటరీ 2 వ బెటాలియను.

ఇది ముఖ్యంగా కేశవభోస్లే కథే కావచ్చును. కాని ఇందులో గుణపారమొకటి కలదు. తన దేశానికి ప్రమాదం వచ్చినపుడు ఆ మహారాజు భోగాలు సౌఖ్యంవిడచి, సామాన్య శిపాయివలె శిక్షణపొంది, తన మహరాటా యోధుల నాయ కత్వం వహించుటకు చిన్న ఉద్యోగంతో సంతృ ప్తిచెంది అర్హత అనుభంగడించెను.

యుద్ధంలో సైన్యానికి నాయకత్వం వహించి నడిపించడం, శాంతి సమయాలో తాముచేసే పనులవంటిది కాదనియు, సైన్యానికి ఎక్కువ నష్ట కష్టాలులేకుండ నిర్వహించాలంటే, చిన్న పనుల నుండి నేర్చియుండి సమర్థత గ్రహించాలనియు అతడు గుర్తించెను. ఈ భావం మహరాటా నాయకులలో నుండునంతకాలం, శివాజి మహ రాజు నాటిన భావాంకురములు వృథాపోవునని భయపడ నవసరంలేదు.

# ఎల్ ఆడం ముట్టడి.

## భారతీయ సైనికుల జయప్రదమగు రక్షణ ఉపసంహారము.

ఎల్ ఆడం ముట్టడియందు భారతీయ సైనికులు అధిక సంఖ్యా శత్రుసేనల నెదిరించి రక్షించుకొన్న విధం సైనిక చరిత్రలో పట్టుదలకు నిదర్శనంగా చిరకాలం జ్ఞాపకముండగలదు.

ఎల్ ఆడము అను వూరు ఆఫ్రికాలో మధ్యధరా సముద్ర తీరమున టోబ్రుకు కోటకు దక్షిణంగా 20 మైళ్ల దూరంలో వుంది. డెర్నా నగరానికి త్రోవలోను, ఎడారి రైలు మార్గమునకు కొన స్టేషనుగ నుంది. ఈ రైలు మార్గమును న్యూజిలాండు దేశీయులు భారతీయులు కట్టిరి.

ఇచట మంచి విమానాశ్రయంగలదు. దానికి మూడు మైళ్లదూరంలో రక్షణశిబిరం 'ఎల్ ఆడంబాక్సు' అను పేరన కట్టబడియుంది ఇది మన వశంలో ఉంటే టోబ్రుకుపై శత్రువులు దాడిచేయజాలరు.

ఈ బాక్సు చాల యుక్తియుక్తంగా ఎంచి కట్టబడినది. కాని దీనికన్న ఎత్తుగా ఒక దిబ్బ ఆ ప్రక్కన కలదు. దీని రక్షణకు ఒక బ్రిగేడు సైన్యం ఉంచుటకు మొదట వుద్దేశించబడెను. కాని జర్మనులు దానిపై దాడి చేయుసరికి రెండు బెటాలియనులు మాత్రముండెను. ఒకటి 5 వ మరాటా లైటు ఇను ఫెంట్రీ రెండోది 2 వ పంజాబు రెజిమెంటు.

మే 27 నుండి జూను 16 లోగా ఎల్ ఆడం మూడుసార్లు ముట్టడి చేయబడెను. కాని మూడు సారులును శత్రువులు ఎక్కువ నష్టంతో తరిమివేయబడిరి. మన సైన్యాలు వెడలి వచ్చేవరకు ఆ ప్రాంతంలో ఎక్కడగూడా శత్రువులు త్రోసుకరాలేదు.

మొదటిసారి జర్మను టాంకులు ఎల్ డూబాను వశపరచుకొని టోబ్రుకు రోడుపైనున్న బెల్ హామీదునుకూడ ఆక్రమించినవి కాని వెంటనే తరిమివేయబడినవి. ఎల్ ఆడముపై దాడికూడా విఫలమయింది.

బీర్ హాకీము ఖాళీచేసినపిమ్మట 90 వ లైటులారీడు ఇనుఫెంట్రీయు, 21 వ పంజాబు డివిజను టాంకులును ఎల్ ఆడమును వేరొకసారి ముట్టడి చేసినవి. కాని గారివాలిసు ఉత్తరంనుండి తిరుగు దాడి చేయుసరికి జర్మను కాల్బలం గాభరా చెంది పారిపోయింది. అదివరకు కాన్వాయిలలో పట్టుకున్న బ్రిటిషు ఇండియను ఖైదీలనుకూడ వదలిపెట్టి జర్మనులు పారిపోయిరి. ఇచటనే 10 మంది గారివాలి ఖైదీలు 11 గురు జర్మను ఖైదీలతో తిరిగివచ్చిరి. ఒక మరాటా లాంసు నాయకుని 12 గురు జర్మనులు చేరి తమను ఖైదీలుగా తీసుకపోవలెనని బ్రతిమాలిరి.

### జయప్రదంగా విరమించుట.

జూను 13 వ తేదిన యుద్ధంలో దురదృష్టవశాత్తు మనం ఘట్టి దెబ్బతిన్న తరువాత సైన్యాలను గజాలా రంగమునుండి మరల్చవలసినప్పుడు శత్రువులు ఎల్ ఆడముపై ఒత్తిడి ఎక్కువచేసిరి. అచట 'బాక్సు' యితర సైన్యాలతో సంపర్కం లేకుండా చుట్టివేయబడినది. నిరంతరంగా ఫిరంగులు మ్రోగుచుండెను. విమానాలు బాంబులు వేస్తున్నాయి, అందున్న గారిజనుపై మర ఫిరంగులు ప్రేలుస్తున్నవి. టాంకులువచ్చి పంజాబి మరాటి రక్షక సైన్యాన్ని అణచేయాలని చూచినవి.

జూను 14 వ తేదిన మొదటి రెండు దాడులు మరాటి జట్టుపై గురిచేయబడినవి. గుండ్లతో కన్నాలుపడి భీతిచెందిన సేన లుంటాయని శత్రువులనుకున్నారు. కాని అట్లుకాక చురుకుగా తిరిగి కొట్టుచున్న సైనికులనుచూసి జర్మను లాశ్చర్యపోయిరి. వెనక్కుపోయి, పంజాబీలున్నవైపు దాడిచేసిరి. ఇచటను తమరాకకు యిదే మర్యాద జరిగినందున, వెనక్కుపోయి ఆలోచించుకొనిరి.

ఇట్లాంటి పరిస్థితులలోగూడ గారిజను కేవలం రక్షణ కార్యమందే లేదు. ఒక మహారాట వేగు దళము బయటకుపోయి, తమకు చాలా చికాకులు పెట్టుచున్న శత్రు ఫిరంగియున్న స్థలంచూచి వచ్చెను. ఆ వేగుదళము నాయకుడుగా పోయిన జమేదారు రాజారాం నికం గాయపడెను, కాని తన సేనను స్వస్థానం చేర్చగల్గెను. ఫిరంగి ఎక్కడుందో సైన్యానికి తెలిపెను. శత్రు ఫిరంగి ముక్కముక్కలయ్యేటట్లు గుండ్లతో పేల్చి వేయబడెను.

రాత్రులంను వేగుదళములు దూరముగపోయి కావలా కాయుచుండెను. ఒక పంజాబి దళము ఒక టాంకు చాటుచాటుగ వచ్చుట గాంచెను. దీనిని బాంబులతో కొట్టి నాశనంచేసి ఒక ఖైదీని పట్టుకొనిరి. దాని వెనుకవచ్చుచుండిన టాంకు అయుధ మోటారు వెనుదిరిగి అతివడిగా పారి పోయినవి. బాగా కనబడనందున యీ మాత్రమే చేయగలిగితిమని పంజాబీ లనిరి.

మహారాట టాంకు విధ్వంసక దళము రెండు టాంకులను నిశ్చయంగా పాడుచేసినది. ఇంకొకటి కూడ పాడయి యుండెను. వాకల్దారు సుఖారాం శవంతు యీ రెండు టాంకులను నాశనం చేసెను. కాని అతను ఆ యుద్ధంలో చనిపోయెను. మరునాడు శత్రువు యీ ఫిరంగులపైనే ఎక్కువ గ్రుండ్లు ప్రేల్చిరి. ఒక 2 పౌండ్ల ఫిరంగి చెడింది. ఈ ప్రాంతంలో శత్రుదాడి ఏమియు జరుగలేదు.

## శత్రువులకు ఎక్కువ నష్టం.

శత్రువుల దాడులు వస్తూనే ఉన్నాయి కాని తరిమివేయబడుతున్నయి. ఒకరోజునే జర్మను ఇటలీ అంబులెన్సు మోటారులు ఆరుసారులు తీగలవద్దకువచ్చి చనిపోయినవారిని గాయపడినవారిని తీసుకపోయినవి. అంటే శత్రుసేన ఎంత నష్టపడియుందో తెలుసుకోవచ్చును.

జూను 16 వ తేది సైన్యం విరమించాలని ఉత్తరువు చేయబడెను. కాని వెంటనే ఆ ఉత్తరువులు రద్దుచేయబడెను. ఎంత నష్టమైన ఎల్ అడం విడువగాదని సైనికులకు తెలుపబడెను. సైనికులంతా ఉత్సాహంతో ఉప్పొంగిరి. శత్రు దాడులన్ని విఫలంచేసిన పిమ్మట పారిపోవడం వారి కిష్టంలేదు.

తరువాత రాత్రే రెండు బెటాలియనుల యోధులను త్యాగం చేయరాదని నిశ్చయించబడెను. కనుక వీలయినంత త్వరలో ఆ చోటు విడిచిపోవాలని ఉత్తరువు చేయబడిరి. తాము తీసుక పోజాలనివన్నీ నాశనంచేయుట పద్ధతిప్రకారం సైనికులు జరిపిరి. 16-17 వ తేదుల రాత్రి 1 గంటకు సైనికులు చీకటిలో, శత్రు నివహములను దాటి వెడవలసిన ప్రమాదకరమగు ప్రయాణం ప్రారంభించిరి.

బాక్సులోపల నుండిన మోటారులు శత్రు శిబిరాల మధ్యనుండి ఖాళీ స్థలాలగుండా పోవలసి యుండును. రాయలు విమానాలువచ్చి పైనుండి శత్రువుపై బాంబులువేసి మర ఫిరంగులతో కొట్టి వీలయినంత శబ్దంచేసి చీకాకుపరచుననియు, ఆ సందడిలో వెడలిపోతున్న మోటారు చక్రాల చప్పుడు వినబడకుండా పారిపోవచ్చునియు మొదట ఏర్పాటు చేయబడెను. కాని అట్లా జరుగుటకు వీలులేకపోయెను ఫలితం ఏమంటే మన సైన్యం పారిపోతున్నదని శత్రువుకి త్వరగ తెలిసిపోయింది. పోతున్న మోటారులపై ఫిరంగులు ప్రేల్చిరి. చాల కాలిపోయి, బహు కొద్దిమాత్రం బయటకు పోయినవి.

కాల్బలము కాలినడకనే ప్రత్యేక మార్గములననుసరించి వెడలసాగెను. మొదటవారికి కష్టం లేకుండెను. బాక్సు వెలుపటకు వచ్చుసరికి శత్రు శిబిరాలలో పడిరి. 20 మైళ్లు నడువవలసియుండెను. దారి పొడుగున శత్రు సేనలు ఎదుర్కొంటునే వున్నవి. ఈ వెడలిపోవడంలో పంజాబీలకు కొంత నష్టంకలిగెను. మహారాష్ట్రులు చాల మంది అగుపడలేదు.

## చిక్కుల పయనం.

చాల చిక్కు ప్రయాణం. రాత్రంతా ప్రమాదాలు, యుద్ధమే. బెటాలియను చిన్న చిన్న భాగాలుగా చీలిపోయి వెడలుచుండెను. ప్రతి జట్టుకి ఏదో వింత అనుభవం కలిగింది. ఆ రాత్రి తమ

జట్టుకి కలిగిన కష్టంగూర్చి సుబేదారు డేరాసింగు ఐ ఒ ఎం. గారు తెలిపిరి. అతని జట్టు 30 మంది యుండిరి. బాక్సు దాటిరాగానే అతనికి శత్రువు లెదురయ్యిరి. ఆతడు తన 30 మందిని వలయంగా నిలబెట్టి తుపాకులు పేల్చుకొంటు ముందుకి సాగి పొమ్మనెను మొదటి శత్రు శిబిరం అట్టే కష్టం లేకుండా దాటిపోయిరి. తరువాత యింకో శత్రు శిబిరం పెద్దది ఎదురయినది. పంజాబీ సైనికులు అందులోనికి చొచ్చుకపోయి, తుపాకి సున్నీలు రక్తంతో ఎర్రబడి బయటకువచ్చిరి. చాల తీవ్రమగుపోరు. ఒక లాంసు నాయకు యిరువురు జర్మనులను, తన వద్దనున్న బ్రెనుగను బారెలుతో అణగగొట్టెను.

జర్మనులు లోతులేని ట్రెంచీలలో నున్నారు. వారి అసమర్థతకు అది నిదర్శనం. డేరాసింగు ఒక ట్రెంచిలో దాగొనియున్న జర్మనుపై కాలు వేసెను. వేరొక జర్మను ఆ కాలులాగి సింగును పడగొట్టచూచెను. సుబేదారు తన సైనికుల మధ్య నుండెను. కాని పిస్తోలీ తీసిపేలిస్తే, తన మనిషికే తగులునని కొట్టలేదు. తన కాలు ఒక జర్మను మెడపైవేసి, కర్రతో వాని తలపై కొట్టుసరికి వాడు తెలివితప్పి పడిపోయెను. జర్మను బుర్ర చాల ఘట్టిదగుటచే ఆ కర్ర విరిగెను. తనకు అధికారులు నష్టపరిహారమివ్వాలని డేరాసింగనెను. ఇంకో జర్మను తుపాకి సున్నీతో పొడువబడెను.

## జర్మనులు లొంగిపోవుట.

జర్మనులు చేతులు పైకెత్తి నిలచుట డేరాసింగు చూచెను. వారిని ఖైదీలుగ వెంట తీసుకపోదామని సైనికు లంటారు. కాని తమ సంఖ్య చాల తక్కువగ ఉన్నందున అంత ఎక్కువమందిని ఖైదీలుగా వెంటతీసుకపోలేమని సుబేదారనెను. వారిని కాపలా కాయుటలో త్వరగ పోవుటకు వీలుండదనే సరికి సైనికులు పూర్తిగ యిష్టం లేకున్నా అంగీకరించిరి.

కొందరు పంజాబీలు గాయపడిరి. వారిలో ఎక్కువమంది తుపాకులు కాలుచునే యున్నారు. ఒకడు తీవ్రముగ గాయపడెను. వానిని 200 గజాలవరకు సుబేదారు మోసుకపోయెను. కాని గాయపడినవాడు అక్కడనే విడచిపెట్టమని తొందరచేసెను. "నా కొరకు మీరంతా శత్రువుకి పట్టుపడిపోతారు. అప్పుడు నేను చాల నిం



సైనిక శిక్షణయందు నిరోధములను దాటుట.

దించుకుంటాను. వద్దు. నన్ను యిక్కడే విడువండి" అని ఆ గాయపడినవాడు డేరా శింగుని వేడెను. కదలక కూర్చున్నందున అతన్నచట విడచిపోయిరి.

పంజాబీలు పెద్దగ అరుస్తూ, యెక్కువమంది ఉన్నట్లు శత్రువనుకునేటట్లు కేకలువేస్తూ పోయిరి. ఇందువలన చేరువను ఎట్టి ప్రమాదం లేకుండెను. కాని దూరంనుండి శత్రు టాంకులు ఆకర్షించబడ్డాయి. టాంకులువచ్చి పంజాబీలను వెంటాడినవి. చీకటిగ నున్నందున డేరాసింగు వాని సైనికులు నిశ్శబ్దంగా నున్నంతసేపు వారి కగుపడలేదు. కాని నడక ప్రారంభించగనే శత్రువులకు వినబడుచున్నది. శత్రులలో 'కారియర్సు' అనబడేవారు పంజాబు దళానికి అతి చేరువగ నున్నారు. వారు తమ తేలిక టాంకులను త్వరగ రమ్మని సాంజ్ఞలు చేయుచున్నారు.

ఈ రీతిగ రాత్రంతా దొంగాటవలె జరిగింది. పంజాబీలు ముందుకి పోవడం, మళ్లా నిశ్శబ్దంగా నుండడం, కారియర్లు వారిని వెంటబెట్టి టాంకులనుగూడ రప్పించుటకు ప్రయత్నించడం జరుగుతూ వచ్చింది. 4 గంటలకు పంజాబీలకు నిజంగా చిక్కు వచ్చింది.

చివరకు విసిగి, ఏమయితే అయింది ముందుకి త్రోసుకపోదామని, అతివడిగా పారిపోసాగిరి. వారి ధైర్యం వారికి మేలుచేసెను. రెండు మైళ్లు వచ్చుసరికి మరి మోటారు బ్రిగేడు ఒకటి వారికి ఎదురయింది. ■

---

## సైనికుని ప్రార్థన.

"ప్రభూ! నేనీ రోజున ఎంత తీరికలేకయున్నానో నీ వెరుంగుదువు.

కాపున నేను నిన్ను మరచినను నీవు నన్ను మరువవద్దు."

ఆస్ట్లె ప్రభువు ఎడ్జిహిల్లు (1642) యుద్ధానికి పోతూ చేసిన ప్రార్థన.

# ఇండియాలోని బంగారం వంటి పంటలు...



జర్మనీ స్వాధీనం చేసికొనిన యూరపు దేశాల్లో, జపాను స్వాధీనం చేసికొనిన చైనా ప్రాంతాల్లో పంటలను శత్రువులు కొల్లగొట్టుకొనిపోతున్నారు. న్యాయంగా అనుభవించవలసిన రైతులు మలమలమాడి చచ్చిపోతున్నారు. మనకు ముఖ్యాధారము వ్యవసాయమైన ఇండియాలో ఇది జరగనివ్వగలమా? అనేక ఉత్పత్తి సాధనాలున్న ఇండియాపై శత్రువుల కన్ను పడింది. మనలను లోబరచుకొనెందులకు జపాను తియ్యటి మాటలను చెప్పును. ఆ మాటల విషయంలో జాగ్రత్త సుమా! జపాను వారు వచ్చిన మన స్త్రీలు, పిల్లలు మాడుటయే కనుక వారిని ఎదుర్కొనెందులకు సంయుక్తంగా మీ శక్తులను ఉపయోగించండి.

జపానువారి నెదుర్కొనుటకై
జాతీయ యుద్ధ రంగమును
తయారుచేయుడు.



# బ్రిటిషు సైనికులు

## ఇండియాలో సౌఖ్యంగా ఉండేదెట్లా ?

[ఇండియాకు క్రొత్తగవచ్చే బ్రిటిషు సోల్జరులకు సూచనగ ప్రకటింపబడింది యీ దిగువ ప్రణాళిక. దీన్నిబట్టి బ్రిటిషు సైనికోద్యోగులు క్రొత్త దేశంలో తమ సైనికుల భావాలు, వైఖరి ప్రవర్తనలగూర్చి ఎంత జాగ్రత్త చూపుతారో తెలియగలదు.]

అదివరకు బహుశః స్వదేశం విడచిపోనటువంటి బ్రిటిషు సైనికుడు ఇండియాలో దిగగానే క్రొత్త ప్రపంచంలో పడతాడు.



బ్రిటిషు సైనికోద్యోగులు, భారతీయ సిపాయిలు కలసి యీదుట.

అతని సౌఖ్యం చాలవరకు అతనిపైనే ఆధారపడియుంటుంది. తన యిల్లు వాకిలి వదలేసేనే యని దిగులుపడుతూ కూచుంటాడో లేక క్రొత్త పరిస్థితులలో పొందగలిగినంత ఆనందం పొందుటకు నిశ్చయించుకుంటాడో, దానిపై ఆధారపడియుంటుంది.

ఆ సోల్జరు సరైన ధోరణిలోపడితే, తాను గొప్ప చోరవచేసినట్లు, కాలంగడచిన కొలది దేశంయొక్క సంగతులు తెలిసినకొలదీ ఆనందంగా నుండుననియు తెలుసుకోగలడు.

ముందుగా ఆతడు భారతీయులగూర్చి కొంత తెలుసుకోవలసియుండును. భారతీయులు బ్రిటిషు జాతివారు కాక వేరే జాతివారేగాని, తక్కువ జాతివారుకారు. వారి ఆచార వ్యవహారములు మన (ఇంగ్లీషు) ఆచార వ్యవహారముల వంటివి కావు. కాని మర్యాదస్తులు కారని ఎవ్వరనలేరు. ప్రతి జాతిలోను మంచివారూ వున్నారు చెడ్డవారు ఉన్నారు. కాని మర్యాదచూపి, మంచిగానున్న వారిపట్ల చెడ్డగనున్న భారతీయుని నే నెక్కడ చూడలేదు. సూక్ష్మబుద్ధిగల భారతీయులు మిమ్మనిచూడగనే మీకు వారంటే యిష్టముందో లేదో తెలుసుకోగలరు. తమ ఆచార వ్యవహారములగూర్చి మీతో మాట్లాడుటకు సంతోషంతో అంగీకరించును. ఇంటి వ్యవహారాలు మాత్రం అడుగరాదు.

" అయితే భాషపేచీ ఎట్లా తేల్తుంది " అని చదువరి అడగవచ్చును. మదరాసు రాష్ట్రంలో పెక్కండ్రు ఇంగ్లీషువచ్చినవారే. బొంబాయి రాష్ట్రంలోనుండు సోల్జరులు మాత్రం కొంచెం ఉర్దు నేర్చుకుంటేగాని వ్యవహారం సాగదు.

భారతీయులతో మంచిగ సఖ్యతగనుండుటకు బ్రిటిషు వారెవ్వరుగూడ సంకోచింప నవసరం లేదు. భారతీయ సైన్యంలోనున్న బ్రిటిషు

ఆఫీసరులు తమ సైనికులను స్వంత స్నేహితుల వలె చూసుకొని గర్వపడుదురు.

ప్రతివాడు విదేశాలలో నున్నపుడు అచట స్వదేశంయొక్క ప్రతినిధిగా భావించుకోవాలి. మనలో (బ్రిటిషువారిలో) ప్రతివాడు ఇండియాలో ప్రవర్తించు వైఖరిపై ఎంతో ఆధారపడియుంది. ఏ ఒకడు మోరగా క్రూరంగా ఉండిన యుద్ధ ప్రయత్నాలకు లోపంవచ్చును ఏవొక్క సౌమ్య ప్రవర్తన అయినా మన దేశానికి మేలేచేయును.

ఒకప్పుడు మన వాడెవడేనా "నేను ఉత్తమ జాతివాడను" అనడం మీరు వినవచ్చు అపుడు వానికి చెప్పవలసిన జబాబేమంటే, "అట్లా నీవ నుకుంటే, చర్యలల్లోను సద్ప్రవర్తనలో చూపించు" అని.

ఇంకోటేమంటే, నిస్సహాయునివలె దిగులు పడకండి. వెనకో బ్రిటిషు సోల్జరు రోడు ప్రక్కన దిగులుపడి శోకమూర్తివలె కూర్చొని, యీ వ్యాసకర్త కగుపడెను. ఎందుకలాగున్నావని అడుగ ; "వై.ఎం.సి ఎ. ఎక్కడుందో, సినీమా లెటువైపున్నాయో నాకు తెలియదు. ఎవ్వరూ ఇంగ్లీషు మాట్లాడరు" అని చెప్పెను.

ఆ సమయాన్న అతడు టాకు హెచ్‌కి (సైనికుల సదుపాయాలు చూసే సంస్థ) నూరు గజాల దూరంలోవున్నాడు. దారిపోయేవారు పెక్కుమందికి ఇంగ్లీషువచ్చును.

బ్రిటిషు సోల్జరులందరికి దక్షిణ ఇండియాను గూర్చి సమాచారం తెలుపుటకు సైన్యాధికారులు ప్రయత్నించుచున్నారు. కాని "తనకు తాను సహాయంచేసుకొనే వాడికే దేముడు తోడ్పడును" అని మీరు జ్ఞాపకం ఉంచుకోవాలి. మీరట్లుచేస్తే మీకే మంచిలాభం. ఈ దేశంలో మంచి అందమయి, శిల్పంనేర్పు ప్రదర్శించే భవనాలున్నాయి. గ్రామసీమలుగూడ ఇంగ్లాండులోవలెనే ప్రకృతి శోభకలిగి ఉంటాయి—అవీ అందంగానే వుంటాయిగాని ఇంకోవిధంగా వుంటాయి ; వేరువిధమయిన అందంగాని, తక్కువ రకం మాత్రం కాదని తెలుసుకోండి.

ఆఖరుమాట—రాజకీయాల వూసెత్తవద్దు. భారతీయుడెవడైనా మీతో రాజకీయులు చర్చింపదలచినచో, నీవు సిపాయివిగాని రాజకీయవేత్తవు కావనిచెప్పు. విజయం చేకూరినాక ఇండియా స్వాతంత్ర్యంకలిగి సంపదాభివృద్ధి చెందాలనే కోరుతున్నానని చెప్పు.



## ఇచ్చటి వాస్తవ్యులు దరఖాస్తుచేయ నవసరములేదు!

జపానువారు స్వాధీనం చేసికొనిన చైనాలోని వ్యాపార ప్రపంచంలో చిన్న పెద్ద అనే తారతమ్యం లేకుండ చైనావారిని జపానువారు ఉద్యోగములనుంచి తొలగించారు. ఇప్పుడు చైనాలో చీనావారి పారిశ్రామికదారులు లేరు. చైనా షాపులూ లేవు. ఉద్యోగాల్లో చైనావారు లేరు. గుమాస్తాలు లేరు. షైవుచేయువారు లేరు. తుట్టతుదకు బజార్ల వెంబడి తిరిగి అమ్ముకొని జీవించే చైనావారుగూడ లేరు. ఇవన్నియు జపానువారి స్వాధీనమైయున్నవి. ఇవి వారికియుద్ధ ప్రతిఫలములు. జపానువారు వచ్చినప్పుడు ఇదే జరుగుతుంది.

ఇది ఇండియాలో జరుగువరకు నీవు చూస్తూ ఊరుకొనవద్దు. మన రక్షణశక్తిని బలపరచుకొని మనగెలుపు నిశ్చయమగువరకు ప్రతివ్యక్తియొక్క (స్త్రీగాని పురుషుడుగాని) సహాయ్యము చేయవలసియున్నది.



జపానువారి నెదుర్కొనుటకై దేశీయ యుద్ధ రంగమును తయారు చేయుడు

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS